# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## విమానం కథ




25 నయాపైసలు

17-6-59

ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY

# ఆంధ్రసచిత్రవారపత్రిక

| సంవత్సర చందా రు. 13—8—0 విదేశములకు 25 ష. పై | Founder: K. NAGESWARA RAO<br>వికారి వైశాఖ శుద్ధ ఏకాదశి బుధవారం | సంపుటము 53 సంచిక 37 **17-6-59** |
|---|---|---|

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
శ్రీ శాస్త్రివారి 'కలుక్కు – పగటిచుక్క' లో
జా న కి.







# రాజధాని కబుర్లు

ప్రవీణ్

# కన్నవి విన్నవి....

రాజధానినగరంలో ఈ వారం పెళ్ళిళ్ళు విపరీతంగా జరిగాయి. రాజధాని నగరానికొచ్చి మీరో రాయి విసిరితే, అదో పెళ్ళికొడుకు నెత్తిమీదో, పెళ్ళికూతురు నెత్తిమీదో పడేటట్టుంది. అంతమంది పెళ్ళికొడుకులు, పెళ్లికూతుళ్ళు తిరుగుతున్నారు రాజధాని వీధుల్లో.

అదే మంచిదంటున్నారు కొందరు. ఏది? రాజధాని వీధుల్లో తిరుగాడ్డం కాదు. పెళ్ళికూతుళ్ళ, పెళ్ళికొడుకుల నెత్తిమీద రాళ్ళు పడ్డం. "లేకపోతే ఏమిటండి? దేశంలో జనాభా విపరీతంగా పెరిగిపోతూంది. ఉన్న వాళ్ళు తిండిలేక చస్తున్నారు. వీళ్ళకి - ఉన్న వాళ్ళకి - తిండి తేలేక చస్తూంది ప్రభుత్వం. ఇటువంటి పరిస్థితుల్లో పెళ్ళిళ్ళా? ఇన్ని పెళ్లిళ్ళా? నాన్సెన్స్!" అంటున్నారు ఈ కొందరు.

మరి కొందరు ఈ పెళ్ళవుతూన్న వాళ్లని చూసి, విచారంగా అంటున్నారు: "అయ్యో, పాపం! ఇంతమంది పెళ్లి కాని వాళ్ళున్నారన్న మాట నగరంలో ఇంత వరకు. ఎంత ఘోరం? ఎంత అన్యాయం? పెళ్ళి వెదికిపట్టుకొని పెళ్ళిచేసెయ్యండి త్వర త్వరగా" అని.

వీళ్ళందరి మాటలూ మనకెందుకు కాని, పెళ్ళిళ్లు రాజధానినగరంలో విపరీతంగా జరుగుతున్న మాట వాస్తవం. ఏ సందుమలుపు తిరిగితే, రిక్షామనిషి, కారు, బండీ ఏ పెళ్ళి పందిట్లోకి వెళ్ళిపోతాయో, వెళ్ళిపోతారో అని భయంగా ఉంది. పల్లకీలో పెళ్లి ఊరేగింపులు చూశాం మనం. కార్లలో పెళ్ళికొడుకులు, పెళ్ళికూతుర్లు బాలానంద సంఘ సభ్యుల సమూహాలతో కలిసి ఊరేగడం చూశాం. కాని ఇప్పుడు ఒక రిక్షాలో వధూవరుల నిద్దరనూ కూచోపెట్టి, ముందు రిక్షాల్లో బాజాభజంత్రీలను కూచోపెట్టి ఊరేగించేస్తున్నారు.

పెళ్ళి చేసుకోడం, చెయ్యడం మంచిదే. పెళ్ళి విందుల కెళ్ళడం బాగానే ఉంటుంది. కాని ఈ వధూవరుల సింగారంకోసం బంగారం ధర పెరిగిపోతూంది. రాజధాని నగరంలో సిటీకార్లకి పెళ్ళిళ్ళకిపోయే బంధుజనులతో బస్సులు నిండిపోతున్నాయి ఆఫీసుకి పోడానికి అరగంట నిలబడ్డానరే, పచ్చబట్టలు కనపడేసరికి భయపడి బస్సులు ఆగకుండా పోతున్నాయి.

ప్రభుత్వం అధికారికంగా పెళ్ళిళ్ళ ముహూర్తాలు ఐపోయాయని ప్రకటిస్తేకాని, ప్రమాదంగా ఉంది పరిస్థితి. బస్సుల్లో ముందు సీట్లల్లో బాజాభజంత్రీలను కూచోపెట్టి, వెనక సీట్లో వధూవరులు కూచొని, బస్సురూట్లవెంట ఊరేగింపులు ఏర్పాటు చేసేటట్టున్నారు పెద్దలు.

* * *

ముహూర్తాలతో సంబంధం లేకుండా జరిగే పెళ్ళిళ్ళు 'రిజిస్ట్రేషన్' పెళ్ళిళ్ళు. నేను చదువుకున్న వాణ్ణి కాను. చట్టం ఏమంటూందో నాకు తెలియదు. కాని రాజధాని నగరంలో డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుని పెళ్ళిళ్ళ రిజిస్ట్రారుగా నియమించింది ప్రభుత్వం అని నాకు తెలుసు.

"పెళ్ళి చేసుకుంటే చేసుకో,-లేకపోతే, మానెయ్! కాని తర్వాత నువ్వు విచారించడం తప్పదు" అన్నాడు ఒకసారి సోక్రటీస్. అన్నాట్ట. ఈ పెద్దలు ఏ మాటలు ఏ విధంగా చెప్పినా, పెళ్ళి ఏవిధంగా జరిగినా, వధూవరులు కలలుకంటూ వైవాహిక జీవిత ప్రాంగణం ప్రవేశించడం తప్పదు. దొంగల్ని, దోపిడీదారుల్ని, హంతకుల్నీ నిలబెట్టినచోట వధూవరులను నిలబెట్టి వివాహకాండ జరిపించడమంతటిఅన్యాయం వేరొకటిలేదు ఇటువంటి ఏర్పాటు చేయాలని ప్రభుత్వానికి తోచినందుకు చెప్పాలి. ప్రభుత్వం ఇప్పటికైనా, నిబంధనలలో గట్టాలలో సవరణ ప్రకటించి, పెళ్ళిళ్ళు చేసే బాధ్యత సిటీ సివిల్ కోర్టుకి అప్పగిస్తే బాగుంటుంది.

## వేసవి ఎండలు……వెర్రిమొర్రి ఆలోచనలు

రాజధాని నగరంలో ఎండలు, విపరీతంగా ఉన్నాయి పెళ్ళిళ్ళ కంటె కూడా. ఈ ఎండ వేడిని తగ్గించడానికి హైదరాబాదు 'అటవిక' పాలక సంఘం ఏర్పాట్లు చేస్తుందని భావించడం పొరపాటౌతుంది. నగరంలో బాటల వెంబడి నడిచిపోయే బాటసారులకి కొంతవరకు పెళ్ళిపందిళ్ళే వేడిమి తగ్గిస్తున్నాయి.

వేడి విపరీతంగా పెరగడంవల్ల-మంత్రులు పార్టీ కొంపలపైన, చుట్టూ పర్యటనలు ప్రారంభించారు. "మంత్రి ఒక్కరైనా లేకుండా సాంస్కృతిక కార్యక్రమాలేమిటి? ఏర్పాటు చేసినా, ప్రయోజనాలుండాలికదా?" అనుకుని కార్యకర్తలు ప్రదర్శనలు మానుకున్నారు. సెలవులకి విద్యార్థులు తమతమ గ్రామాలకిపోయారు. అందువల్ల "రాజధాని కబుర్ల"లో వ్రాయడానికి విశేషాలు లేవు. విశేషాలు లేకుంటే ఏం? వివరాలు ఉన్నాయిగా?

ఈమధ్య రాజధానినగరంలో ఒక కుక్కకి పిచ్చెక్కింది. కుక్క అసలు నాతికెక్క- పిచ్చెక్కదుండు! ఒకరోజు ఉదయం ఎక్కినికరవాలాఅని హఠాత్తుగా ఆలోచించడం ప్రారంభించింది. పదకొండుమందిని కరిచేసింది. అందులో ఇద్దరు పిల్లలు. ఇద్దరు పోలీసువాళ్ళు. ఎంతపిచ్చికుక్క కాకపోతే పోలీసువాళ్ళను కరవడానికి సాహసిస్తుంది అన్నారు జనం ముక్కుమీద వేళ్లేసుకుని.

"కుక్క కఱచెనని-హాయనీయక పట్టి
కుక్క విరుగదన్ని-దండెట్టి;
నిమ్మకాయ తెచ్చి-నెత్తిన పెట్టిన
కుక్క విసుమువిసుమ-పరుగుతీయు!"



# న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

## అరుణా అసఫాలీ రాజీనామా

గాంధీజీ స్వీయచరిత్ర పేరు 'ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్'... ఈనాడు ఢిల్లీ ప్రజాస్వామ్యంతో ప్రయోగాలు చేసి చెలగాటాలాడుతోంది. ఒక్క ముక్కలో ఇందులో పరమార్థం చెప్పడానికి స్వార్థం అన్న మాట తంగున సరిపోతుంది.

స్థితిగతులు చూస్తూవుంటే మంచీ చెడ్డా కుడీ ఎడమా తెలుసుకోవడంలో సర్దార్ పటేల్ మీద గౌరవం నానాటికీ పెరుగుతోంది. ప్రధానీ, పటేల్ — ఈ యిద్దరిలో హెచ్చురకకు, ముఖ్యంగా ఢిల్లీ హృదయం విషయంలో, పటేల్ దే పై చెయ్యి. ఇక్కడ పుట్టి పెరిగినవారూ, ఈ మట్టి (గచ్చులెండి) మెట్టి బాగుపడ్డవారూ వారి తీరుతెన్నులూ పటేల్‌కు క్షుణ్ణంగా తెలుసు. అసలాయన సిసలైన రాజనీతివేత్త; రాజకీయవాదికాదు. ఏ సమస్య వచ్చినా, హృదయంతో కాక, బుర్రతో ఆలోచించి వ్యవహారం చేసేమనిషి. ఉద్వేగానికి ఆయనకీ చాలాదూరం. ఢిల్లీనీ, ప్రజాస్వామ్యం పద్ధతి రాజకీయ వ్యవస్థనూ దూరదూరంగా ఉంచాలని, దానికీ దీనికీ పడదనీ ఆయన నమ్మకం. ఆయన వెళ్ళిపోగానే, తరువాతి పెద్దలు, ఆతురాలా ఆయన అన్న మాటకు విరుద్ధమైన పనిచేశారు. ఇది ఇలా ఉండాలి అన్న నమ్మకంకన్న, ఆయన కూడదన్నాడు గదా అన్న పట్టుదలతో పంతంతో విర్ర వ్యవహరించి దీనికి ఓ 'శాసన'సభను ఇచ్చారు. ఈ అవకతవకల అసలు కథ అంతా ఇప్పుడప్పుడే అసలు రంగులో కనిపించదు.

రాజకీయ సంగ్రామ రంగస్థలంమీద ఢిల్లీ ముఖ్యమంత్రి గిరీకి ఇద్దరు పెద్దలు దావాలుచేసుకున్నారు. ఒకరు చౌధురి బ్రహ్మప్రకాష్; రెండవవారు డా॥ సుశీలా నయ్యర్. గమ్మత్తేమిటంటే పోటీలో ఈ యిద్దరూ ఓడిపోయారు. పైపెచ్చు సర్దార్ గురుముఖ్ నిహాల్ సింగ్ మహావీరుడనిపించుకున్నాడు.

ముఖ్యమంత్రి గిరియే కాక, రాజస్థాన్ గవర్నరుకూడా చేపాయించేశాడాయన.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం ధర్మమా అని ప్రజాస్వామ్య వ్యవస్థ అనేది నానా అవస్థలూ పడి కడతేరపోయి కడతేరిపోయింది. ప్రజాస్వామ్యంకాబట్టి రాజలాంఛనాలూ మర్యాదలూకూడా లేకుండా పోయాయి.

చెప్పొచ్చే కథ ఢిల్లీ వ్యథ. మంత్రిపదవి పోరాటం అలా అయినమీదట, రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సారధ్యంకోసం ఇంకో పోరాటం. ఈసారి బ్రహ్మప్రకాష్‌జీకి ప్రత్యర్థి శ్రీమతి సుభద్రా జోషీ. ఆవిడా, ఆమె అనుయాయులూ చిత్తుగా ఓడిపోయారుగాని, కాంగ్రెసుమటుకు మహోజ్వల విజయం సాధించలేకపోయింది. దీని పర్యవసానంగా ఢిల్లీ కార్పొరేషన్‌లో కూడా కాంగ్రెసు దెబ్బతింది. ఉన్నవాటిలో పెద్ద పార్టీగా వచ్చింది తప్ప, అందరికన్న బలంగల మెజారిటీ రాలేదు. జనసంఘంతో గాని, కులతత్వవాదులతో గాని చేతులు కలపడానికి ఒప్పుకోనూ లేదు. తత్ఫలితంగా అరుణా అసఫాలీని గతసంవత్సరం మేయరు పదవికి తేవడానికి కాంగ్రెసు తోడ్పడింది. ఈయేడు పార్టీ సభ్యుడినే పెట్టుకోవాలనుకుంది.

పార్టీ అంటే ఒకమాట చెప్పాల్సివుంది. ఇది చాలా చిత్రమైంది. కాంగ్రెసుపార్టీ లోంచి ఒక సభ్యుడిని తీసిపారేస్తే అతడు జనసంఘీయుడై మొలుస్తాడు.

ఇష్టం లేకపోయినా కాంగ్రెసు బలాబలాల ప్రకారం రెండవస్థానం ఆక్రమించిన జనసంఘంతో లోపాయకారీ బేరం పెట్టి ఒప్పందం కుదుర్చుకుంది. కాంగ్రెసు సభ్యుడినే మేయరుగా నిలబెట్టాలని ఏర్పాటు. అయితే, తీరా, కాంగ్రెసు పార్టీలో చీ పేచీలొచ్చాయి, అభ్యర్థికాతగ్గ వాడెవడూ అని. ఆ అంశంమీద, ఏవిధంగా చూసినా, అపూర్వమైన స్తుతిపాత్రమైన ఏకీభావం కుదిరిందికాదు. పైపెచ్చు ఏడుగురుసభ్యులు రాజీనామాపెట్టి పోవడంతో, అవతలి పార్టీతో రాజీకూడా చెడింది. కాంగ్రెసు అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధి కలగ



# న్యూఢిల్లీ లేఖ



చేసుకోవడంతో కాక మళ్ళింది వ్యవహారం. అయిన, జనసంఘంలో తమకేమీ సంబంధం లేదని ప్రకటించడంకూడా జరగడంతో మేయరుగిరీని కాంగ్రెసు సభ్యుడు అలంకరించే అవకాశం పూర్తిగా తప్పిపోయింది. అటుతిరిగి ఇటు తిరిగి, చివరకు అరుణాఅసఫాలీనే మళ్ళీ మేయరు చేశారు. ఈ ఎన్నిక నుంచి కాంగ్రెసు మంచి గుణపాఠం నేర్చుకోవాలి. మర్నాడే పాకులాడడం, ఓకులాటలు ఆరంభమైంది. తాను సాయం చేసింది కాబట్టి మేయరు తన చేతి కీలుబొమ్మ కావాలని పొరబడింది జనసంఘం. అరుణాదేవి అలా లొంగే మనిషి కాదు. ఇటు కాంగ్రెసూ, ఓడిపోయానన్న అక్కసు కొద్దీ, అకార్యాచరణకు పడిగట్టింది. మొదటిది అపూర్వమైన అహింసా ప్రదర్శనం. "శాంతివాదులు" అనేకులం వాళ్ళమని చాలకాలంగా చెబుతున్న కౌన్సిలర్లు ఇద్దరు (ఒకరు గొప్ప-కాంగ్రెసువాది; మరొకరు మాజీ-కాంగ్రెసువాది) నిండు సభలో వాదాలకుదిగి తన్నులాటదాకా వెళ్ళారు. ఆర్. ఎస్: అగ్రవాల్ అనే మరొకాయన మేయరుమీద ఉత్తరాలవాడి ఆరంభించాడు. అవి చాలా అవమానకరంగా ఉన్నాయనీ, అగ్రవాల్ బేషరతుగా క్షమాపణ చెప్పుకోవాలనీ మేయరు అనడంలో కథ పాకానపడింది. ఆ ఘట్టంలో ఇంకో అగ్రవాల్ — లాలాశ్యామ్‌నాథ్, కలగచేసుకొని, ఈ పోరాటం అగ్రవాల్‌కీ మేయర్‌కీ జరిగేదికాదు ఇది కాంగ్రెసుతో పేచీ అని దండాన్వయం చెప్పారు. ఆయన కార్పొరేషన్‌లో కాంగ్రెసుపార్టీ నాయకుడాయె. అక్కడితో అరుణాఅసఫాలీ చొరవ చేసి తనమీద సభవారు విశ్వాసం ప్రకటిస్తూ తీర్మానంచేసి ఓటుకు పెట్టాలంది. (ఇదిగనక జరిగేట్లయితే జనసంఘం తటస్థంగా ఉండేటట్లుగా కాంగ్రెసు లోపాయికారీ ఏర్పాటు చేసినట్లు ఒక పుకారు.)

దురదృష్టవశాత్తూ కాంగ్రెసు అధిష్ఠానవర్గం వారు ఈ ఘట్టంలో కలగచేసుకొని సయోధ్య కట్టకు రావడానికి బాబూ సత్యనారాయణ సిన్హాని పంపింది. జనసంఘం తటస్థంగా ఉంటుంది కాబట్టి, అరుణను పడగొట్టగలమన్న ధీమాకొద్దీ కాంగ్రెసు కౌన్సిలర్లు మధ్యవర్తిగా వచ్చిన పెద్దమనిషి సత్యనారాయణ మాట విన్నారు కారు. సభ్యులు సహకరించాలని మేయరు కోరింది. ఇచ్చి పుచ్చుకునే పద్ధతిపై అవసరమైన మేరకు సహకరిస్తామన్నారు కాంగ్రెసు వారు. ఇది బ్రిటిష్ హయాంలో తిలక్ అనుయాయులు అనుసరించిన పద్ధతి- రెస్పాన్సివ్ కోఆపరేషన్ అనేవారు. అప్పట్లో కాంగ్రెసు పూర్తిగా సహాయ నిరాకరణోద్యమం నడిపితే తిలక్ వర్గం ఈ పద్ధతి పెట్టింది.

అరుణా అసఫాలీకి ఈ కప్పల తక్కెడ వ్యవహారం నచ్చలేదు. మేయరు పదవికి రాజీనామా పెట్టేసింది. బాబూ సత్యనారాయణ్ ఇదంతా చూసి దిగాలుపడిపోయారు. ఆ నిస్పృహలోను చిరాకులోను, అసలు ఈ 'గుణకారం' కట్టేస్తే మంచిదన్న మాట కూడా ఆయన అన్నారు. ఆ మాటతో కార్పొరేషన్ కాంగ్రెసు కొంచెం తమాయించుకుంది. "అట్టే మేయరు రాజీనామా చెయ్యడం మాకూ యిష్టం లేదు. అది మా ఉద్దేశం కాదు" అని పార్టీనాయకుడు లాలా శ్యామనాథ్ ఒక ప్రకటన చేశారు!

* * *

ఈ యేణ్ణర్థంగా ఢిల్లీ కార్పొరేషన్ చేసిందేమిటి? అధికారంకోసం కొట్టుకోవడం. ప్రతిమాటనీ చేతనీ స్వార్థపరంగా అర్థం చేసుకోవడం.

కొందరు శ్రీమతి అసఫాలీని కమ్యూనిస్టు అనుకూలవాది అన్నారు. ఆ మాటను ఆమె ఖండించింది. ఆమెవల్ల కొన్ని లోపాలు పొరపాట్లు జరిగితే జరిగిఉండవచ్చు గాని, ఆమె కార్పొరేషన్‌లో కొన్ని మంచి పద్ధతులూ, గొప్ప సంప్రదాయాలూ ఏర్పరచింది. మేయరుగానే కాక, కేవలం అరుణా అసఫాలీగా ఆమెకు విలువ, పరువు ప్రతిష్ఠ ఉన్నాయి. ఆమెకు ప్రధానియింట, హోంమంత్రి యింట చనువు స్వతంత్రం ఉన్నాయి. తరవాత రాబోయే మేయర్లకు ఈ అవకాశం ఉండదు. అరుణ అసఫాలీ స్థాయి వేరు. వీరిదారి వేరు. ఈరోజున ఆమె పదవి వదలడం కార్పొరేషన్‌కూ, ఢిల్లీ నగరానికీ కూడా గొప్ప లోటే. ఢిల్లీ పత్రికలన్నీ ముక్తకంఠంతో ఆమెను మెచ్చుకుంటున్నాయి; దాంతోపాటు ఈ రభసకు కారకులైన కౌన్సిలర్ల వైఖరినీ, చేష్టలను గర్హిస్తున్నాయి.

ఇప్పుడున్న పార్టీబలాల ప్రకారం మేయరు సింహాసనంమీద అరుణా అసఫాలీకన్న కాంగ్రెసు ప్రతినిధి ఆస్టేసేవు ధగధగలాడడం కష్టమని బాబూ సత్యనారాయణ సిన్హా, ఫిరోజ్ గాంధీ కూడా అన్నారు. చేదుగా ఉన్నా—నిజానికి చేదు కాబట్టే—ఈ మాట నిజం అని ఒప్పుకోవాలి. కాంగ్రెసు అభ్యర్థి మేయరైతే, ఆ మేయరు జనసంఘ్ చేతిలో కీలుబొమ్మ కావాలి; లేదా కాన్ఫిడెన్స్ తీర్మానం వచ్చినప్పుడల్లా నేలకూలుబొమ్మ కావాలి. అంతే.

ప్రభుత్వం వివేకవంతమైన పనులు ఏమైనా వెంటనే చెయ్యదలచుకుంటే, సత్యనారాయణ సిన్హా సలహా పాటించటం ఒకటి.

ఈ కార్పొరేషన్‌ను ఏడేళ్లపాటు అణచి ఉంచి పెట్టాలని ఆయన సలహా. పైసారి ఎన్నికలలో, ఢిల్లీ పౌరులకు నిజంగా సేవ చేయగల పార్టీ ఏదేనా ఒకటి మెజారిటీబలం సంపాదించే అవకాశం ఉంటుంది. ★



# కథ కాని కథ



## "అదీ ఒకరకం సంపాదనే"

[మొదటి బహుమతి రచన]

బొంబాయి మెరైన్ డ్రైవులో వరుసగా తీర్చి దిద్దినట్లున్న మేడలను చూస్తూ నడుస్తున్నాను. గట్టిగా 'తొంభై ఏడు, తొంభై ఎనిమిది...' అని ఎవరో అంటున్నారు, హిందీలో. 'ఇదేమిటి చెప్మా!' అని ఇటు చూద్దును గదా 'నూరు' అన్నాడు నన్ను చూచి, ఒక కుర్రవాడు. వాడి వాలకం, సామాను చూచి బూట్సు పాలిషు చేసే వాడను కున్నాను. కాని నన్ను చూచి 'నూరు' అనడం, నన్ను ఆపడం ఎందుకో అర్థంకాలేదు. ఇంతలో ఆ కుర్రవాడు 'ఇవాళ నాపుట్టిన రోజు. అందుకని ఈ ప్రక్కనుండి వెళ్ళే ప్రతి నూరో మనిషికి డబ్బులేకుండా బూటు పాలిషు చేస్తాను' అని నా బూట్సుకు అద్దంలాగా పాలిషు చేశాడు. నాకు ఆ కుర్రవాడిమీద జాలి వేసి మామూలుగా పాలిషుకు ఇచ్చే అణా బదులు పావలా ఇచ్చాను. వాడు దండం పెట్టి మళ్ళా 'ఒకటి, రెండు, మూడు' అని లెక్కపెట్టడం మొదలు పెట్టాడు. కొంత దూరం నడిచిన తర్వాత, ఇదంతా గమనిస్తున్న




ఒక పెద్దమనిషి 'వాడికి ప్రతి ఆదివారం పుట్టిన రోజేలెండి' అన్నాడు.

డా॥ కె. కృష్ణమూర్తి-మైసూరు.

* * *

## కొత్తరకం ముంజెలు

[రెండవ బహుమతి రచన]

అవి వేసవి కాలం ప్రారంభము రోజులు. కోనసీమలో మంత్రిగారు తన మిత్రులతో పార్టీ వారితో ఒకరోజున కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాలినడకన పర్యటిస్తున్నారు. వారిలో ఒకరు "ఏమండీ, ఇక్కడ మంచి లేత ముంజలు దొరుకుతాయి, కొంచము తింటారా" అని మంత్రిగారిని అడిగారు.

దానికి మంత్రిగారు "ఇప్పుడే కాదబోయి, ఎండలు ప్రారంభించినవి; అప్పుడే ముంజెలు ఎలాగ వస్తాయి?" అన్నారు.

"అదేమిటండీ, ఇంకా ముంజలు రాకపోవడమేమిటి? కాయలు అప్పుడే ముదిరిపోయి పెంకు కట్టేస్తేను! కావలిస్తే అలాగ పైకి చూడండి. ముదిరిపోయి ముంజెలు ఎలాగ గుత్తులు గుత్తులుగావున్నాయో?" మంత్రిగారు తాటిచెట్లవైపు తలపైకి ఎత్తిచూచారు. అన్ని చెట్లకు కుండలు కట్టివున్నాయి ముంజకాయలవలె. ఆకుండలు తాటికల్లుకొరకు కట్టబడ్డాయి అని మంత్రిగారు గ్రహించి, తన మిత్రుల ఛలోక్తిలో తానూ పాల్గొని, తర్వాత ప్రోహిబిషన్ వారికి పని కల్పించారు.

తుమ్మల ప్రవరాఖ్యరావు,
కాకినాడ.

* * *

## నిబంధనలు

ఈ శీర్షికలో ప్రచురణార్హం పంపే రచనలు వారపత్రికలో ఒక కాలమును మించకూడదు. సంఘటనలు యథార్థంగా జరిగినవే అయివుండాలి. ఎవరినీ నొప్పించేవిగా, అవమానించేవిగా ఉండకూడదు. ఉత్తమ రచనకు పది రూపాయలు బహుమతి. రెండవ బహుమతి (తగిన రచన వచ్చినప్పుడు మాత్రమే) ఐదు రూపాయలు పారితోషికం. బహుమతుల విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. ప్రచురణకు స్వీకరించని రచనలను తిప్పిపంపటంగాని, రచయితలతో ఉత్తర ప్రత్యుత్తరాలు గాని జరగవు. రచనపంపే కవరుపై 'కథకాని కథ'కొరకు అని రాయాలి. అలా రాయనివాటిని స్వీకరించబడవు. ఈశీర్షిక వారంవిడిచి వారం ప్రచురిస్తాము.

# భద్రయ్యగారి సమస్య

భద్రయ్యగారు మరీ అంత సంపన్న గృహస్థని చెప్పలేం కాని, వారిది మట్టుగా ఈదుకుపోతూన్న సంసారమనే చెప్పాలి.

గత మాసమే ఆయనకు షష్టి పూర్తి అయింది. ఉద్యోగం విరమించి చాలా ఏళ్ళే కావస్తూంది పెన్షను ఎక్కువే రాపోయినా, భూములూ, తోటమీద సాలుకు నికరంగా అరువందలూ స్వగృహానికి పక్కనే కొన్న స్థలంలో కట్టించిన యింటికి అద్దె నలభై రూపాయిలూ, యిదీ ఆయన ప్రస్తుత ఆదాయం.

పదేళ్ళ కిందటే పెద్ద కొడుకు బి. ఏ., బి. యిడి. చేసి ఆ వూళ్ళోనే మాష్టరుగా చేరాడు జీతం నూటనలభై, ప్రైవేటుల మరో నలభై తెచ్చేవాడు. రెండోవాడు బి. కాం. చేసి ఆడిటర్ శాస్త్రిగారి ఆఫీసులో పని చేస్తున్నాడు నూట యాభై తెచ్చుకుంటున్నాడు చురుకైనవాడని అందరి అభిప్రాయం స్వతంత్రంగా ప్రైవేట్ ఆడిటర్ అండ్ ఎకౌంటెంటుగా ప్రాక్టీస్ పెట్టమని, అతని మీద గురి కల వర్తకులు చాలా మంది ప్రోత్సహిస్తున్నారు కూడా. ఇద్దరు కుమారులకూ పెళ్ళిళ్ళయాయి మూడవవాడు బి. ఎస్. సి. చదువుతున్నాడు.

ఒక్కతే కుమార్తె; వివాహమయి అత్తవారింటికి వెళ్ళింది, అల్లుడికి పోస్టల్ శాఖలో ఉద్యోగం; అప్పుడే రెండు సార్లు పురిటికి పుట్టింటికి వచ్చింది

భద్రయ్యగారి భార్య పార్వతమ్మ, నిజంగా పార్వతీదేవి లాగానే, యింటి కుంకుమ బొట్టుతో ముఖానిండుగా వుంటుంది, దొడ్డ యిల్లాలని ప్రతీతి

## దిగుమర్తి రామారావు

చిన్నతనంలోనే వితంతువైన సోదరి కూడా ఒకామె మొదటినుంచీ భద్రయ్యగారివద్దనే వుంటూవచ్చింది, ఆమెకు పిల్లలు లేరు భద్రయ్యగారి పిల్లలను ముప్పాతిక పాళ్ళు ఆవిడే పెంచింది ఆవిడగారంటే భద్రయ్యగారికీ, పార్వతమ్మగారికీ కూడా చాలా అభిమానము ఇదంతా విని, భద్రయ్యగారికేం, మహాబాగా వుందని అనుకోవడం సహజమే కాని, భద్రయ్యగారికి తీరని సమస్య యిప్పటికీ ఒకటుంది. సంసారమన్న తర్వాత చిక్కులూ, సమస్యలూ లేకుండా వుంటాయా? ఏదోరకంగా, కొంతవరకేనా పరిష్కారమవుతూనే వుంటాయి; ఒకటి పరిష్కారమయి, కొత్త 'హమ్మయ్య' అనుకునేటప్పటికి, మరొకటి ఎదురవుతూనే వుంటుంది, ఇది సామాన్యమే అయితే ఎప్పటికీ తీరని సమస్య అనండి, అజేయమనండి, ఒకటి మాత్రం అలా వుండిపోయింది

భద్రయ్యగారిది పూర్వీకులు కట్టించిన యిల్లు మొదట్లో, అంటే ఆయన చిన్నతనంలో, ముందు మూడు గదులూ, మధ్య నడవా, వంటిల్లూ, చూరుకింది చిన్న గదులు ముందు వసారాలో ఒకటీ పెరటి వసారాలో ఒకటిన్నీ వుండేవి క్రమేణా కొట్టుగదీ నీళ్ళగదీ వంటివికూడా ఏర్పాటయ్యాయి ముందు వరసలోని తూర్పుగది భద్రయ్యగారి తలిదండ్రులు వాడేవారు, మధ్య గది ఎవరేనా వస్తే కూర్చోడానికీ, యింట్లోకి వెళ్ళడానికీ ఉపయోగపడేది పశ్చిమపు గది పిల్లలంతా సమిష్టిగా వాడుకునేవారు.

భద్రయ్యగారి నాయనమ్మ, తర్వాత సోదరీ, మధ్య నడవా వసారాలోనే యించుమించు పడుకునేవారు బంధువు లెవరేనావస్తే పిల్లలగదిలోనో, మధ్య నడవాలోనో, చూరుకింది చిన్నగదిలోనో పడుకునేవారు అన్నట్టు చూరుకింది చిన్న గదుల్లో ఒకటి—అప్పటికాలం గనుక—వాకిట వున్న వాళ్ళ కుపయోగపడేది, యిప్పుడో, చాలామంది యిళ్ళల్లోలాగే, భద్రయ్యగారింట్లోనూ, అట్లాంటి పట్టింపు లంతగా లేవనుకోండి

తలిదండ్రులు బాగా వుంటున్నప్పుడే భద్రయ్యగారి చదువు పూర్తి అయి భార్య కాపురానికి వచ్చింది భద్రయ్య దంపతులకు పశ్చిమపుగదే పడకగదిగా వుండేది కాని బంధువు లొచ్చినా, అక్కచెల్లెళ్ళు పురిటికి పుట్టింటికి వచ్చినా, భద్రయ్యగారి గదిలోని కొంత సామానూ, ముఖ్యంగా పెద్ద మంచం, అక్కడినుంచి తరలించవలసి వచ్చేది తరుచు ఈ బాధపడలేక, పెద్ద మంచం వాడడమే మానేసి, పంచకింది చిన్నగదినే యించుమించు తమ పడకగదిగా భద్రయ్యగారు ఏర్పాటు చేసుకుంటూ వచ్చారు

భద్రయ్యగారి నాయనమ్మ, తలిదండ్రులూ, వయసుమళ్ళి కాలంచేశాక కూడా భద్రయ్యగారికి సదుపాయమైన పడకగది ఏర్పడలేదు, అప్పటికి ఆయన పెద్ద కుమారుడు



విజయవాడ పట్టణ వ్యాపారస్థులు, ఆంధ్రపత్రిక ఏజంటు శ్రీ నిమ్మగడ్డ వెంకటకృష్ణారావు జ్యేష్ఠ కుమారుడు చి॥ బాబూరాజేంద్రప్రసాద్ కు, పాములపాడు వాస్తవ్యులు శ్రీ కోగంటి శ్యామారావుగారి కుమార్తె చి॥ సౌ॥ రత్నమాణిక్యంబకు మే 29 వ తేదీన కన్యాదాతగారి గృహమందు వివాహము వైభవముగా జరిగినది.



"అవిడా! మా నాటి కవితా కన్య లెండి_"

కాలేజీలోనూ, రెండోవాడు హైస్కూల్లోనూ చదువుతూండడాన్ని, పశ్చిమపుగది వాళ్ళే ఆక్రమించారు. తలిదండ్రులువాడు కుంటే తూర్పుగది పేరుకుమాత్రమే భద్రయ్య గారి గదయింది. ఆగదిలోనే మొదటినుంచీ దస్తావేజులూ, పాత కాగితాలూవంటివన్నీ, కొస్తాకూష్టో కుటుంబానికి చెందిన వెండి బంగారమున్నూ వున్న పెట్టె వుంటూ వచ్చింది. ఆగదినే భద్రయ్యగారి సోదరీ, ఎదుగుతూన్న అమ్మాయీ కూడా మెల్ల మెల్లగా వాడసాగేరు. అందుచేత భద్రయ్య గారికి సదుపాయమైన గది విడిన్నీ స్వేచ్ఛగా వాడడానికి వీలు కలగలేదు.

తరుచుగా భార్యతోమటుకూ "ముందు భాగం బాగా చేయించి, శుభ్రంగా మేడ మీద ఓగది కట్టించేద్దాం," అంటూండేవారు. పార్వతమ్మ నవ్వుతూ "అలాగే" అంటూం డేది. చివరికి కట్టించారుకూడా; కాని. మేడ మీద గది పూర్తి అయేసరికి పెద్దకోడలు కాపురానికి వచ్చింది! సహజంగా, పెద్ద కుమారుడూ, పెద్దకోడలూ మేడమీద గదినే వాడుతూవచ్చారు, పెద్దవాళ్ళకు మేడమెట్లెక్కడం దిగటం యిబ్బందేమోనని కూడా సూచిస్తూ. తరవాత, తరువాత మేడమీద మరో గదికూడా భద్రయ్యగారు కట్టించారు. అదీ అలాగే, రెండో కుమారుడి కాపురానికి సరిగ్గా అందుకోసమే కట్టించినట్టు, కుదిరింది. పోనీ, కిందనే తూర్పుదో, పడమరదో, పెద్ద గది వీలవడుతుందేమో ననుకుంటే అప్పటికి మనవలు చదువుకోడానికి వానికి, ఒకటి కావలసివచ్చింది. మరి, భద్రయ్యగారి తీయని కోరిక, కోరికలాగానే వుండిపోయింది.

కొన్ని సంవత్సరాల క్రిందట కొన్న తమ గృహాన్ని ఆనుకొనే వున్న ఖాళీ స్థలంలో, భద్రయ్యగారు ఓ మాదిరి మరో యిల్లుకూడా కట్టించారు. కట్టించినప్పటినుంచీ అది అద్దెకివ్వడమే జరిగింది. ఒక యింట్లోనే వుంటూ, ఆయనా ఆయన భార్యా వేరే కాపురం పెట్టడం కాని, కొడుకులు వేరే కాపురం వుండడం కాని యింట్లో ఎవరికీ మనస్కరించదు. కుమారులు కూడా అది అద్దెకిచ్చేద్దామనే మొదటినుంచీ అభిప్రాయపడ్డారు. భద్రయ్య గారికేనా అనిపించింది, యిరుగ్గాలేని, కాస్త మరుగున్న పడకగది మాత్రమే కాని వేరే కాపురం కాదు కదా!

సదుపాయమైన గది సంగతలా వుండగా, రాను రాను కుటుంబం పెరుగుతూ వచ్చాక, సంచితింది చిన్నగది అయినా భద్రయ్యదంపతులకు పూర్తిగా దక్కని పరిస్థితి ఒకొక్కప్పుడు తటస్థించేది. భద్రయ్యగారూ, పార్వతమ్మా మంచాలు రెండూ మధ్యనడవ నసారాలోనే తరుచు వేసుకో వలసి వచ్చేది. పాశ్చాత్యుల గృహాల్లో, ఒక నిర్ణీత పద్ధతిని, సాధారణంగా ప్రతీగదీ ప్రత్యేకింపబడి వుంటుంది; మన గృహాల్లో మటుకూ, ఏ ఒకటి రెండో గదులు తప్ప మిగతా యిల్లంతా సమిష్టిగానే వాడుతూ, సర్దుకుంటూండడం జరుగుతుంది. మిగతా అందరి సౌకర్యాలు సమకూడినతరువాతనే యజమాని, యజమానురాలు తమ స్వంతసౌకర్యాలు చూసుకోవడంకూడా మన సంప్రదాయం. అందుచేత కొంతమటుకూ, అందులో ఒకొక్కరికి ప్రత్యేకంగా, యిబ్బంది కలుగుతూంటుంది.

భద్రయ్యగారంటే యింట్లో అందరికీ గౌరవమే. ఆయన పట్ల ఎవ్వరూ నిర్లక్ష్యంగా ప్రవర్తించరు. కాని, ఆయనకు



Dr. D. V. RAJU, B.A., M.B.B.S.
తూర్పు గోదావరి జిల్లా, వయనగ్రామ కాపురస్థులు శ్రీ దాట్ల సత్యనారాయణ రాజుగారి కుమారుడు, డాక్టరు డి. వి. రాజుగారు, ఇండియన్ మెడికల్ ఎసోసియేషన్ ఆధ్వర్యమున, అమెరికాలో ఆధునిక ఉన్నత శస్త్రచికిత్స విధానమందు శిక్షణ పొందుటకు, 18-6-59 న, బొంబాయినుండి బయలుదేరి, న్యూయార్కులోని ఫోర్టు హేవెన్ హాస్పిటలుకు వెళ్లుచున్నారు.

# ఎక్కువ కాలం మీరు షర్టుతోనే ఉంటారు



బెంగుళూరు ఊలెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్
అగ్రహారం రోడ్, బెంగుళూరు 2
మేనేజింగ్ ఏజంట్లు : బిన్నీ & కో (మద్రాస్) లిమిటెడ్

బిన్నీవారి షర్టింగు వేసుకుంటే అది మీ వ్యక్తిత్వాన్ని ఘనపరుస్తుంది. పగలంతా అది మాసిపోకుండా శుభ్రంగా ఉంటుంది.

# ★ భద్రయ్యగారి సమస్య ★

సంతృప్తికరమైన వసతి సదుపాయాలవిష యామె పట్టించుకోవలసిన అవసరం గూర్చి ఎవరికీ స్ఫురించినట్టనిపించదు. ఇదీ ప్రస్తుత పరిస్థితి.

ఏళ్ళకొద్దీ కాపురంచేస్తూంటే మటుకేమిటి; ముచ్చటాడుకోడానికి కాకపోయినా, ఎవరి కన్నో, చెవినో పడుతుందనే శంక లేకుండా, సరదాగా ఏవో కబుర్లు చెప్పుకుంటూ కాల క్షేపం చెయ్యాలని అప్పుడప్పుడే దంపతుల కుండదు! కొత్తకాపురం కొత్త ఆవకాయ లాగా ఒకరుచి; పాతకాపురం కూడా, అంగులో అన్యోన్యంగా వుండే దంపతు లకు, ఊరిన పాత ఊరగాయ లాగా అదొకరుచి!

అందుచేతనే, మంచి సినిమా ఏదేనావస్తే, పిల్లలందరితో కాకుండా, భద్రయ్యగారు పార్వతమ్మను తీసుకొని తామిద్దరే వేరే వెళ్ళే వారు. అలాంటప్పుడే ఆయనకు భార్యతో తీరిగ్గా కాస్త కాలక్షేపం చేసినట్టనిపించేది. సినిమా మధ్యని విశ్రాంతి వేళలో పైకివెళ్ళి సోడాపుచ్చుకొని రెండు మిఠాకిళ్ళిలూ, యిన్ని చాకొలేటు బిళ్ళలూ- భార్యకోసం, యింటివద్దమనవలకోసంకూడా – జేబులో వేసుకొని వచ్చేవారు. దీపాలారిపోగానే, ప్రేక్షకు లెవరూ చూడకుండా మెల్లగా పార్వతమ్మ చేతిని తనచేతిలోకి తీసుకొని రెండుచాకొలేటు బిళ్ళలూ, తాంబూలం ఆప్యాయంగా అందియ్యడం ఆయనకు రివాజు; అలా చేస్తున్నప్పుడు, పార్వతమ్మ కొంచెం సిగ్గుపడుతూ, సరదాగా ఆయన వేపు చూసీ చూడనట్టు చూడడం, అదంతా ఆయనకు మళ్ళీ చిన్నప్పుడులాగానే, ఏదో రహస్యంగా కొంటెపని చేస్తున్నట్టే అని పించేది! సినిమా ఏదేనామంచి రసకట్టులో వున్నప్పుడు భార్య చేతిని నొక్కుతూ, చెవిలో, “హాయిగా గాలివచ్చేటట్టు కిటికీలు తీసేసి పడుకునేందుకు వీలుగా డాబా మీద మూడోగది కట్టించేద్దామా?” అని అంటూండడం కూడా అలవాటే! ఆవిడ కూడా నవ్వుతూ, మెల్లగా, “ఆఁ; యిప్పుడింక మొదలుపెడదాం, మేడమీద కాపురం” అనేసేది.

సినిమానుండి రిక్షాలో తిరిగి వచ్చేస్తున్నప్పుడు, కాలేజీ మలుపు మర్రిచెట్టుదగ్గర, ఎలెక్ట్రిక్ దీపకాంతి రోడ్డుమీద పడక, సుమారు ఒక ఫర్లాంగు మేర చీకటిగా వుంటుంది. అక్కడకు రాగానే, భార్యకు దగ్గరగా జరిగి ఉత్సాహంగా, మెల్లగా భార్యని చేతో పొడవడం ఆయనకు ఇంకో అలవాటు. సినిమా ప్రోగ్రాములో ఏమార్పులున్నా, భద్రయ్యగారి పై ప్రోగ్రాములో మటుకూ మార్పెప్పుడూ వుండేది కాదు; మార్పంటే అసలు పార్వతమ్మే తప్పక విసుపోయేదేమో కూడాను. తీరా యింటికి వచ్చాక ఎప్పుడూవుండే సమస్యే తటస్థపడేది.

ఓసారి కూతురూ, అల్లుడూవచ్చినప్పుడు, పిల్లలంతా సినిమాకి వెళ్ళడానికి ప్రోగ్రాము వేసుకున్నారు. మర్యాదకోసమైతేనేం, పెద్దవాళ్ళమీద గౌరవంచేతనైతేనేం, భద్రయ్యగారి సోదరీ, రెండవకుమారుడూ “అమ్మా నాన్నా యిద్దర్నీ యింట్లోవుంచి, మనమంతా వెళ్తే వాళ్ళకేం తోస్తుంది? మేం కూడా యింట్లోనే వుంటాం,” అన్నారు. కాని భద్రయ్యగారు, “మాకోసం వుండి పోవడం ఎందుకూ? అమ్మాయీ, అల్లుడూ వచ్చారు; అంతా సరదాగా మీ అత్తయ్యను కూడా తీసుకొని వెళ్ళిరండి. కావలిస్తే చిన్న పిల్లను యింట్లోవుంచే వెళ్ళండి; మీ అమ్మ పాలుపట్టి పడుకోపెడుతుంది,” అంటూ, అంతమందినీ బలవంతంచేసి ప్రోత్సాహ పరిచారు.

రిక్షాలమీద అంతా బయలుదేరగానే, కాస్త విస్మయంతో ఈయన వేపు చూస్తూన్న పార్వతమ్మతో, “విధి గడియ వేసివస్తున్నా; ఈ కాస్త సేపైనా హాయిగా డాబామీద కూచుందాం, పద, పద,” అంటూ భావగర్భితంగా చూచారు; ఇంత ముత్తయిదువా, పార్వతమ్మగారి ముఖం ఎఱ్ఱపడిపోయింది!

చెప్పవచ్చే దేమిటంటే: ఏ ఏడాదికో, ఆర్నెల్లకో లభించే యిటువంటికొద్ది అవకాశాలు తప్పిస్తే, భద్రయ్యగారి సమస్య అలాగే వుండిపోయింది. ★

తెల్లగా చిరుపాపల్లా నిద్రపోతున్న మల్లె మొగ్గల్ని నుప్పచేసి దండగుచ్చుతుంటే, సన్నటి సూది, చేపపిల్లలా జారి 'కసుక్కున' వేలు కరిచింది. సూది గుచ్చుకున్న చోట ఉబికిన కండ, దానిమీద కొంచెం కొంచెం పెద్దదవుతున్న రక్తబిందువుని తుడిచి 'అయ్యో!' అనుకోటానికి మనసు రాలేదు. 'నాకేమీ తెలియదన్నట్లు' కొనకి నెత్తురు పూసుకుని కన్పించీ కన్పించకుండా నేల మీద పడుక్కుంది సూది. పెరిగి పెరిగి పెద్దదై, కుంకం బొట్టంతై, మధ్యాహ్న సూర్యుడంతైన నెత్తుటి చుక్కని తుడిచి వెయ్యలేక పోతోంది.

ఆ రంగు తనకు ప్రాణం అది తన శరీరపు రంగు, తనలో ప్రవహించే జీవప్రవాహపు రంగు, ఆ రంగు తాలూకు చిహ్నాలు కూడా తనకి నిషేధించి దూరం చేసినా తనని విడిచి పెట్టని రంగు, ఆ గాఢసత్వానికి బలి అయిన తనకు ప్రతినిధిగా నిలిచిన ఆ వర్ణం మీద తనకు జాలి - మమత, లోకంలోని ఏ వస్తువు మీద లేని అనురాగం - గుండె పిండే ఆ రంగుకి నైవేద్యం చేద్దామని కోరిక, కార్చే కన్నీరు ఆ రంగులో కార్చి ఋణం తీర్చుకుందామనే ఆకాంక్ష.

బిందువుగా నిలిచిన రక్తాన్ని గోటితో కల్యాణ తిలకంగా దిద్దుతోంది - సరిదిద్దుతోంది. జలతారు కాంతులు చిమ్ముతూ వాయువేగాన్ని మించి పరుగులు పెట్టే జోడు గుర్రాల్లాంటి కళ్ళు పూన్చిన విశాలమైన ఫాలభాగస్యందనం మీద ఠీవిగా స్వారీ చేసే సౌందర్యరూపమైన కల్యాణ తిలకానికి వన్నెలు తీరుస్తోంది తను చేయని నేర

# ఎర్రమల్లె

ఫలంగా వచ్చిన శిక్షకి, కర్మపేరుతో జరిగిన అఘాయిత్యానికి ఫలించని తన అదృష్టానికి, తన నుంచి లాగివేయబడ్డ మూలధనానికి ఫలితంగా, స్వామిలేని దేవాలయంగా పువ్వు కోయబడి మిగిలిన తొడిమలా, పేలవంగా, కళాహీనంగా, తెల్లని తెల్ల కాగితంలా ఉన్న తన ముఖం చూడటం శుభప్రదం కాదని తొలిగిపోయే లోకానికి తెలియకుండా, చాటుగా, పొగిలి పొదల నీడన, ప్రకృతి ఇచ్చిన అభయముద్ర మాటున గుండె పులకలెత్తగా అందాలు అనుభవిస్తోంది.

కల్యాణ తిలకానికి కొసలుతీర్చి రూపమిచ్చింది. మహాసౌందర్యం నిగ్గులుతీరి నిల్చున్నట్లుగా ఉన్న ఆ రూపాన్ని చూసి నిశ్చేష్టురాలయింది.

ఒకనాడు లీలగా కొన్ని క్షణాలపాటు తన ముఖంమీద మెరిసి, తనలో జీవకళ నింపి, తన అందానికి పరిపూర్ణత నిచ్చి

## సత్యం శంకరమంచి

శాశ్వతంగా అంతర్ధానమైంది.

కల్యాణ తిలకంగా రూపొందిన రక్తం కదిలిపోయి రూపం మార్చుకుంటోంది - చెమ్మటకు చెదిరిన కుంకం బొట్టులా, చెరిగిన తన భాగ్యరేఖలా చెరిగిపోతున్న కల్యాణ తిలకాన్ని చూస్తుంటే మనసు విలవిలలాడ్తోంది. ఆలస్యం చేయకుండా వేలుని గట్టిగా కనుబొమ్మల మధ్య ఒత్తుకుని నుదుటి మీద తిలకం నిల్పుకుంది. కొలనులోకి వంగి చూసుకుంది. తన ముఖం - తను ఎన్నడూ చూసుకోని అందాలముఖం. ఆ ముఖంలో మన్మథబాణంలా నిలిచిన కల్యాణ తిలకం. తనను సర్వమంగళగా శుభప్రదగా నిల్పగలిగే మహత్తరమైన వస్తువు నుదుటి మీద వెలిగి పోతోంది.

కాంతులు వెలార్చే ఈ ముఖంతో అందరికీ స్వాగతం చెప్తుంది. సుఖాలకు ఆనందాలకు ఆటపట్టవుతుంది. శాంతికి సహృదయతకు వాకిళ్ళు తెరుస్తుంది. తన స్వామి పాదాలకు వంగి వందనం చేస్తుంది. నుదుటి మీద కల్యాణతిలకం లీలగా ఆ పాదాల కంటుకుంటుంది. అది ఆనందాల నిధిగా, శాశ్వత మంగళ ప్రదాయినిగా భాసిస్తుంది. తలెత్తి స్వామివైపు ఆనందంగా చూస్తుంది. స్వామి నీలి మబ్బులవంటి చేతుల్లో లేవనెత్తి తనని అక్కునచేర్చి లాలిస్తాడు. తను సిగ్గుల బరువై ఆ కౌగిలిలో ఒదిగిపోతుంది.

కొలనులో నీళ్ళు గాలికి జలజల కదిలాయి. కల తొలగిపోయింది. కదులుతున్న నీళ్ళలో తన నుదుటిమీది తిలకం నాట్యం చేస్తోంది. తన మనసు ఆనందంతో ఊగిసలాడుతూ గాలికంటె తేలిక తేలిపోతోంది. తన ముఖంలో సిగ్గు దొంతరలు తనే చూడలేక చరాలున ముఖం మల్లె పొదలవైపు తిప్పుకుంది.

సంపెంగి వాసనలు పరుగెత్తుకొచ్చి గిలిగింతలు పెట్టాయి. జాజీ మొగ్గలు సంతోషంగా తలలెగురవేశాయి. వికసించిన గులాబీలు గుండెనిండుగా నవ్వి ఆనందించాయి. ఇంతటి సంతోషాన్ని తట్టుకోలేక తూలిపోతోంది. తల వాల్చేసుకుంది.

దండ కట్టని మల్లెపూలు దిక్కు మొహం పెట్టి పలకరించాయి. ఇప్పటి దాకా వాటి సంగతే మర్చిపోయినందుకు నొచ్చుకుని దండ గుచ్చటం మొదలెట్టింది.

ఆకాశాన పెద్ద మబ్బు పక్కనే ఒక చిన్ని మబ్బు నడిచి వెళ్తోంది. ఆ చిన్ని మబ్బు లేకపోతే ఆ మేఘానికి అంత అందం లేదనుకుంది. చెట్టుమీద పిట్టల జంట ముక్కులు రాసుకుంటూ రెక్కలు దువ్వుకుంటున్నాయి. ఆడపిట్టకి కోపమొచ్చి కాబోలు దూరంగా జరిగి వెళ్ళటం చూసి తనలో తను నవ్వుకుంది.

ఈనాడు తన మనసు సంతోషంతో నిండిపోయింది. తన ముఖంమీద కల్యాణ తిలకం దీపంలా వెలుగుతోంది. మల్లెదండ సిగలో తురుముకుని తన ఆనందాన్ని అపారం చెయ్యాలి. నల్లటి ఆకాశంలాంటి కురుల్లో కుప్పపోసిన నక్షత్రాల్లా, తన సౌందర్యాన్ని శ్లాఘించే కావ్యంలో అక్షరాల్లా వెలిగాలి. ఇంతటి మహదానందాన్ని పొందబోయే గుండె ఆత్రంగా కొట్టుకుంది. రక్తం వేగంగా ప్రవహించింది. తను సూది గబగబా ఆడించింది.

మల్లెదండ తల్లో పెట్టుకోబోయింది. అక్కడ మల్లెపూలు లేవు. తెల్లటి మల్లెలు నెత్తురు పులుముకుని ఎర్రటి పూలయ్యాయి. కొన్ని వందల సూదిపోట్లు తిన్న చెయ్యి రక్తం చిమ్ముతోంది. గుండె నీరైంది. ఆకాశంవైపు చూసింది. అక్కడ పెద్ద మబ్బులో చిన్న మబ్బు కలిసిపోయింది. పిట్ట ఎక్కడికో ఎగిరిపోతే చెట్టు బోసిపోయింది. కొలను నీళ్ళలో తన ముఖంమీద కల్యాణతిలకం జారిపోయి కన్నీళ్ళలో కలిసిపోవటం కన్పించింది. ఎర్రగా నిప్పుకణాల్లో ఉన్న మల్లెపూలను పిచ్చిగా తల మీద పోసుకుంది. ప్రవహిస్తున్న రక్తాన్ని ముఖమంతా పులుముకుంది.

నీళ్ళలో ఏవో నీడలు కదిలాయి. రేగిన కార్చిచ్చులా, ముక్కంటి మంటలా, విలయాగ్ని కీలలా—

# కథానాయకుడు

యస్వీ జోగారావు

## 1

'ఆడదాన్ని నమ్మరాదు' అన్నాడు పశుపతి అతిగంభీరంగా తానేదో తాజాగా కనిపెట్టినట్టు. వెంటనే ఆ సూత్రానికి వ్యాఖ్యానంగూడా ప్రారంభించాడు. ప్రచండమైన ఆవేశంతో వాదించుకు పోతున్నాడు. నిజానికతనితో ఎవరూ వాదించడం లేదప్పుడు. ఆవేళ కక్కడున్న వాళ్ళందరూ అతనిచ్చిన కాఫీ టిఫిన్ సేవించినవారగుటంబట్టి విధిలేక మాటిమాటపడి వినుచున్నవారు. అంతే. ఆ ధోరణి అలా పోతున్నది. పురాణాల్లోంచి, చరిత్రలోంచి వరసగా నిదర్శనాలు నిరూపిస్తూ ఆడదాన్ని నమ్మి చెడిన జనాభా లెక్కలు గుణించుకుంటూ పోతోంది ధోరణి. ధను తెగరగొట్టేస్తున్నాడు. ముఖ్యంగా తాను పెట్టిన ఫలహారాలవల్ల మరి వాళ్ళకి రాత్రిభోజనం అవసరం వుండదని గ్రహించినవాడవటంవల్లనే అలా చెప్పుకుపోతున్నాడు పశుపతి.

జాముర్రాత్రి గడిచింది. వెంకట్రావు మరి వుండబట్టలేక 'పశుపతిగారూ! రేపు ఆదివారం మన క్లబ్బులో ప్రత్యేకం ఈ విషయమై మీ ఉపన్యాసమొకటి ఏర్పాటు చేయిస్తాం. ఆవేళ సావకాశంగా సవిస్తరంగా యథేచ్ఛగా మాట్లాడుదురు గాని' అన్నాడు.

'మన క్లబ్బులో గాదు మాట్లాడితే మహిళామండలి సభలో మాట్లాడాలి' అన్నారు పశుపతిగారు.

'సరేలే, ఆ మండలి కార్యదర్శిని మన వెంకటసుబ్బయ్య భార్యేకదూ! వాడిచేత సిఫారసు చెయిస్తా' అన్నాడు చలమయ్య.

'భా-భా! ఆవిడ అతగాణ్ణిప్పుడు ఏలుకోడం మానేసిందని విన్నాను. మధ్య వాడి సిఫారసేమిటి నాకు!' అన్నాడు పశుపతి.

'పోనీలెండి మహిళామండలి పైకి మన మిస్టర్ చంగోలం లేడూ. వాడితో చెపితే పని జరుగుతుందిలెండి. ఇంతకీ ఆ విషయం మాకొదిలేద్దురూ' అన్నాడు సదాశివం.

పశుపతి ధీమాగా మందహాసం చేశాడు.

'మరి సెలవిప్పించండి మాకు' అన్నాడు రాజారావు కుర్చీలోంచి లేచిపోయి.

అందరూ 'సెలవు! సెలవు!' అని అతని సెలవు తీసుకోకుండానే లేచి వెళ్ళిపోతున్నారు.

చలమయ్య గేటుదాకా సాగనంపడానికి వెళ్ళేడు. ఆ తరువాత—

'ఏమిటండీ మరీ ఆవేశపడిపోతున్నాడు మనిషి! ఏదో కొంత అనుభవశాలిలా కూడా వున్నాడు పాపం!' అన్నాడు రాజారావు పశుపతికి అంతరంగికుడైన చలమయ్యతో.

చలమయ్య జవాబేమీ యివ్వలేదు.

'ఆ ఆవేశం చూస్తే నాకేమనిపిస్తుందంటే ఆయన సతీమణే ఎవడితోనో...' అని సదాశివం అనబోతూవుంటే

'తప్పు తప్పు ఆయనభార్య యింట్లోనే వుందిరా! ఆవిడ చేసినవే ఆ టిఫిన్లన్నీను' అన్నాడు చలమయ్య.

'అబ్బె యిప్పటి మాటకాదు. ఎప్పుడో చిన్నగా షికారు చేసివుంటుంది. అది పశుపతి కిటీవల తెలిసుంటుం' దన్నాడు సదాశివం.

'అదేమిట్రా అలా ఆడిపోసుకుంటారు! ఎవళ్ళో మీలాంటి వెర్రివాళ్లు ఆవిడకి ప్రణయలేఖలంటూ ఏవేవో వ్రాస్తారు. ఆవిడకొంత దియ్యటానికి. అవి చూసి శివమెత్తిపోతాడు పశుపతి. ఉత్త పుణ్యాని కావిడ ననుమానిస్తాడు. చావబాదుతాడు. ఎన్నడూ పశ్చాత్తాప మెరగని మగధీరుడాయన!' అన్నాడు చలమయ్య.

'నిజమైన అంతరంగికుడివంటే నువ్వేనోయ్!' అని యేదో అనబోయాడు సదాశివం.

చలమయ్య వెంటనే అందుకుని 'ఏమిటోయ్ నాకే చెబుతున్నావే చెవిలో' అన్నాడు.

'పాపం పశుపతి మాత్రం ఏకపత్నీవ్రతుడే అనుకుంటాడు' అన్నాడు వెంకట్రావు చలమయ్య కళ్లలోకి చూస్తూ.

'అవకాశం దొరకని దౌర్భాగ్యులందరూ ఏకపత్నీవ్రతులే! ప్రణయమైనా, పాతివ్రత్యమైనా, వేశ్యాత్వమైనా అవకాశానికే చెల్లింది. వ్యభిచరిస్తూ ఏకపత్నీవ్రతాన్ని అభినయించడం, పాతివ్రత్యంగురించి ఉపన్యాసాలివ్వడం పురుషులికి పరిపాటి అయిపోయింది. మరి ఆడదాన్ని నమ్మకూడదంటాడుకదా పశుపతి అంత నమ్మకూడనిపనేం చెయ్యగలదు ఆడది? పరపురుషుడి సంపర్కమేగా ఆయన ఉద్దేశించింది. మరి నమ్మకం విషయంలో ఆడదాన్నే దుయ్యబడతాడుగాని ఆ పురుషుడి ఊసెత్తడేం ఈ పురుషుడు!' అన్నాడు రాజారావు ఒక్క విసిరి.

చలమయ్య నిశ్చలమైన చూపులో ఒక మందహాసరేఖ తళుక్కుమంది.

'సదాశివం! కథావస్తువుకి జల్దో!' అని సన్నగా హెచ్చరించాడు రాజారావు.

చలమయ్య గేటు తలుపు వేసుకుని లోపలికిపోయాడు. అతనక్కడే వుంటుంటాడు. అతను పశుపతిగారికీ, ఆయన భార్యకూ కావలసిన బంధువు. అతని పశుపతి తండ్రే పెంచాడు. పశుపతిగారి వ్యవహారాలన్నీ చలమయ్యే చూస్తూ వుంటాడు.

## 2

జాము రాత్రి గడచిన తరవాత ఇంటికి చేరిన సదాశివం దగ్గరికి తెల్లవారేసరికల్లా టెలిగ్రాంలా గొప్పవార్త వచ్చిపడింది.

ఇంకా ఆరుగంటలు కానేలేదు. అప్పుడే చిన్న ఊరేమో ఊరు ఊరంతా గుప్పుగోలుగా ఒకటే పుకారు—వసుమతి లేచిపోయిందంటే లేచిపోయిందన్నారు.

'ఎంత ఘోరం! విడ్డూరం! అరి దీనింటా బట్టాను!' అనే మాటలు వినిపిస్తున్నాయి నీలాటి రేవులో.

# కథానాయకుడు

'ఈవిడ ఎప్పుడో ఏదో ఒక అఘాయిత్యం చేస్తుందని ఎప్పుడో అనుకున్నమాటే. అయినా ఈ రావణాసురుడితో ఎవర్తి కాపురం చేస్తుదిలే! రోజూ అదే బాదటం మా గొడ్డుని బాదినట్టు!' అని యిలా రచ్చపావిడినుండి సరాసరి సంతమెట్టదాకా పశుపతి ప్రశంసలే.

'అన్నట్టు ఈ చలమయ్య ఏమయ్యాడు చెప్మా!' అని ఎవరో అడుగుతుంటున్న గుసగుసలు విని సత్రంలో ఒక సాధువు 'సిద్ధి పొందుంటాడు మహానుభావుడు!' అని గొణుక్కున్నాడు చిలుంగొట్టాం ఒక్క దమ్ములాగి పొగ వదుల్తూ.

పశుపతి చిందులు తొక్కుతున్నాడు. చిర్రుబుర్రు లాడుతున్నాడు. కారాలూ మిరియాలూ నూరుతున్నాడు. విషాదాంత నాటకంలో చివరి సీనులో హీరోలాగ స్వగతాలు పఠిస్తున్నాడు.

మధ్యాహ్నం మహిళా మండలి కార్యదర్శిని వచ్చింది. పశుపతిగారింటికి మరి పరామర్శ చెయ్యడానికో! ఉపన్యాసానికి కాహ్వానించడానికో!

ఆడపురుగును చూస్తే హాలమార్చేట్టున్నాడు పశుపతి ఆవేళప్పుడు. గేటులోంచి వస్తున్నావిడను చూసి మేడ కిటికీలోంచే 'ఎవరునువ్వు?' అని గుడ్లురిమి గద్దించాడు.

ఆవిడ పైకిచూసి 'నేను ... నేను ... మిసెస్ వెంకటసుబ్బయ్యని' అంది.

'ఆఁ!'అని గాండ్రించి ఝామ్మని మెట్లు దిగుతున్నాడు పశుపతి ఉండొమ్మన్నా నీపని చెప్తా నన్నట్టుగా.

ఆవిడ పాడురెత్తి వెనుదిరిగిపోయింది.

'ఒసేయ్ వెంకటసుబ్బయ్యా!' అని ఓండ్రపెట్టేడు పశుపతి.

మత్తేభగామిని భామిని కురంగయానమై గేటుదాటిపోయింది.

ఈమె యింకా తన్ను మిసెస్ వెంకటసుబ్బయ్యనని యెందుకు చెప్పుకుంటుందా అని విసుపోయి ఆలోచిస్తున్నాడు పశుపతి. మళ్లా 'ఓహో యీవిడ మహిళామండలి కార్యదర్శినికదూ' అని మనస్సును సమాధానపరుచుకుని వెంకటసుబ్బయ్యను తలుచుకొని సానుభూతితో ఒక్క వేడినిట్టూర్పు విడిచాడు.

కాస్సేపటికి గేటులోపలికి మరో వ్యక్తి ప్రవేశించాడు.

'ఎవడ్రా నువ్వు?' అన్నాడు పశుపతి.

'నేన్సార్ పోస్టుమేన్ చలమయ్యని'

'ఫో వాడూ నువ్వూ ఊరెట్టుకొంది'___

ఇతని కేదో మతి చలించినట్లుంతనుకుని టపా అక్కడ పారేసి పోయేడు పోస్టుమేన్

# 3

ఆ సాయంకాలం—

'వసుమతి లేచిపోయింది! చలమయ్య గాడితో లేచిపోయింది!' అని కథ మొదలెట్టేడు సదాశివం.

'ఏమిట్రా నాన్నా వ్రాస్తున్నావు కథేనా?' అంటూ వచ్చాడు రాజారావు.

'ఇప్పుడే మొదలు పెట్టేనురా'

'ఏమిటీ! ఇంతవరకూ ఓపిక పట్టేవూ! అసలు కథ అప్పుడే మంచి పట్టులోకి వచ్చేసే ఇంకా యిప్పుడే మొదలెట్టడ మేమిట్రా?'

'వెధవ!'

'ఎవడిమీదికిరోయ్ ఈ ప్రయోగం! నీ కథలో మాటా? వసుమతి పోర్షనా? నీ స్వగతమా? ఇంతకీ ఎలా మొదలెట్టావో చెప్పు చూదాం'

'వసుమతి లేచిపోయింది'-అతి వాస్తవికంగా మొదలెట్టేశానులే.'

'అబ్బే అతివాస్తవికంగా లే! సరిలే ఎవడితో లేచిపోయిందంటావు?"

'సంగన్నా—ఇలా మాట్లాడకు మరి చలమయ్యగాడితో లేచిపోయిందని రాశేశాన్లే అప్పుడే'

'అబ్బా! అబ్బా! పోనీగాని 'గాడు' అన్నమాటెందుకూ అక్కడ? వాడిమీదెందుకూ నీకంత అక్కసు? సరే ఎవడితో లేచిపోతే నేం! లేచిపోయిందని రాసేశావుగా కాని బ్రదర్ ఆసంగతి నీకెలా తెలిసింది?'

'కళ్లారా చూసినవాళ్లు చెప్తారా చెబితే చెవులారా విని...'

'మనసారా కసిదీరా రాస్తున్నా నంటావు, సరే అదిద ఎందుకు లేచి పోయిందంటావు?'

'పశుపతంటే యిష్టంలేక'

'అయితే చలమయ్యతోటే ఎందుకు లేచి పోవాలి?'

'వాడంటే మోజు!'

'అయితే ఒకలాగు మొదలెట్టకూడదూ కథ—'వసుమతి లేచిపోయింది పాపం' సదాశివంతో కాదు చలమయ్యతో లేచిపోయింది! అని—

'మధ్య నా ఊసెందుకురా!'

'అతి వాస్తవికతరా బ్రదర్!'

'ఒక కాస్సేపు నువ్వూరుకో'

'అయితే సరే కథ నడుపు'

'ఇద్దరూ మెడ్రాసుపోయారు ఫుడ్ లాండ్స్‌లో దిగేరు.'

'నీకేం తెలుసు అలా జరిగిందని?'

'ఇంతవరకూ జరిగింది యథార్థం. ఆపైది కథార్థం. జరిగినదాన్ని బట్టి జరగదగిన దాన్ని ఊహించటమే మా కథకుల పరమార్థం.'

'బాగానేవుంది కాని ప్రస్తుతం ఈ కథలో నీ స్వార్థానికెంత డిస్కౌంటు చూపిస్తావు మరి?'

'ఇందులో నా స్వార్థమేముంది?'

'వసుమతి నీతో లేచి వచ్చేసుంటే ఈకథ రాయవు అవునా?

'మధ్య నాతోనా? నాకేం సమంధం?'

'అబ్బే నీకు సమంధం వుందని కాదోయ్. అసలు వుండడానికి కవకాశం లేకుండా పోయిందని గాని. అమధ్య మతిపోయి వసుమతి మీద ప్రణయగీతం వ్రాసినవాడి విప్పుడు సుమతీశతకకర్తలా మాట్లాడతా వేమిటంట? పోన్లే ముందు నీకథ కానీ'

'మధ్య పానకంలో పుడకలా నువ్వొచ్చి నా కథా ప్రణాళికంతా తారుమారు చేసేశావు.'

'పోనీ నేరుగా చెప్పెయ్యనా నేను నీ అనంతర కథాసంవిధానం ఏమిటో!'

'చెప్పు చూద్దాం!'

## ★ కథానాయకుడు ★

'ఏముంది వారం పదిరోజులు గడిచాక ఆ బలమయ్య వసుమతి దగ్గరున్న డబ్బూ దస్కం తీసుకుని దగా చేసి ఆమె నా హోటల్లో విడిచేసి ఎక్కడికో వుడాయించేశాడంటావు.'

"అదేకాదు. వసుమతే బలమయ్యను దగా చేసి ఇంకెవడో సినీమాల్లో చేర్పిస్తానని ఆశ చూపిస్తే వాడితో లేచిపోయిందంటాను.'

"ఆతరవాత ఆవిడ ప్రసిద్ధ సినీతార అయిపోయి ఆ రెండోవాడినికూడా ద్రోహం చేసిందంటావు."

"కాదు వాళ్ళిద్దరూ చిలకాగోరింకల్లా వున్నారంటాను."

'సరే కథ కంచికి వెళిపోతుంది. కాదు యింటికి తిరిగొచ్చేస్తుంది ప్రతికోలయం నుంచి. చప్పగా నప్పగా నజ్జుగావుందికథ.'

'కాదు తరవాతి సన్నివేశం ఎలా బనాయిస్తానో చూడు!'

'పశుపతి గావాపడేశాడంటావు.'

"అదికాదు ఆవిడ సినీమాల్లో వరసగా పదిసార్లు పతివ్రత వేషం వేసిందంటాను. దాంతో పశ్చాత్తాపం కలిగి యింటికి వచ్చేసిందంటాను. సరిగ్గా ఆవేళకి పశుపతి చచ్చిపోయాడంటాను. కథ క్లయిమాక్సు కి పోతుంది. ఇప్పుడేలాగుందంటావు?"

"ఏడిసినట్టుంది నీ అతివాస్తవికదృష్టి! సినీమాల్లో వేషాలు వేసినంతమాత్రాన్న మారిపోతారూ మనుషులు! వందసార్లు పతివ్రతల వేషాలువేసి తమ వేశ్యాధర్మం పరమపవిత్రంగా సంరక్షించుకుంటూ వున్నవాళ్ళు బోలెడుమంది వున్నారు. అసలన్నిసార్లా వేషం వేసేసరికి వాళ్ళకా పాతివ్రత్యంమీద వైముఖ్యంగూడా పుడుతుందట! ఒకవేళ అంత పశ్చాత్తాపమే కలిగితే ఆడది ఆత్మహత్యయినా చేసుకుంటుందిగాని మళ్ళా ఆ గడప తొక్కదు. మహాఅయితే మొగుడికో క్షమాపణ వుత్తరంముక్క రాసి పారేస్తుంది.'

"అయితే మరెలా తగలెట్టమంటావు కథని?"

'అలా దారికిరా. కాస్సేపు నీ అతివాస్తవికదృష్టి వలావుంచు. కాస్త వోపికపట్టు. ఏదో కాస్త జరిగిందనగానే కలం ఝుళిపించకు. కాస్త నిదానించు. ఒక్క సన్నివేశంలో భిన్న ప్రవృత్తులు ప్రదర్శించిన ఏ ఒక్కపాత్రతోనూ నీకు సానుభూతి లేకపోయె. నీ మనస్సులోవున్న స్వార్థానికి సంచలనం కల్గగానే కలం దూశావు. నీదే గాని అంత వాస్తవికదృష్టిఅయితే సామాన్య మానవతాధర్మానికి ఒక వ్యక్తివల్లగాని పరిస్థితివల్లగాని మరేకారణంవల్లగాని అపచారం కలిగినప్పుడే కలం దూయి. అప్పుడూ దుర్వినయ ద్వేషమేగాని వ్యక్తిద్వేషం పనికిరాదు. పోనీ ప్రకృతం ఏదో కథ చెపేవు. గాని అపురికైనా కాస్త లఘువూ దిగువూ వుంటే వ్యక్తినిష్ఠమైన నన్నత్వం మాటెల్లా వున్నా సాహిత్యదృష్ట్యా అయినా కొంత శిల్పసిద్ధి కలిగివుండేది. అది లేదు నీ ప్రణాళికలో."

"సరే ఆ మానవతాధర్మమో, శిల్పదృష్టో ఏవో వాటిసంగతి త్వరగా ఏడు. ఇక్కడ నా కథ పరిస్థితేకాదు నా పరిస్థితికూడా సస్పెన్సులో పడ్డట్లుంది!"

"ఇప్పుడు టైమెంతయింది?"

"అయిదూనలభై."

'పొద్దున్న ఎన్నింటికి తెలిసింది వార్త నీకు?

'సుమారు ఆరుగంటలకి,'

'సరే నువ్వు వొంటిమీద కాసిన్ని నీళ్లు పోసుకునిరా చెప్తాను.'

'నేనిప్పుడు స్నానం చెయ్యను.'

'వేసంకాలం సాయంత్రం స్నానం చెయ్యడం మంచిదేగా?'

'మంచిదేకాని నేను చెయ్యనంటే మనస్య నీకెందుకూ?'

'చెయ్యమని మా ఆజ్ఞ. నువ్విప్పుడు నా కథలో పాత్రవి. నేనెలా చెబితే అలా నడవాల్సిందే నువ్వు'—

సదాశివం వెళ్ళేడు.

పావుగంటలో స్నానంచేసి వచ్చాడు. తన గదిలోకి వెళ్ళి తల దువ్వుకుందామని అద్దంముందు నుంచున్నాడు. అందులో చలమయ్య మొహం కనబడుతోంది! ఉలిక్కిపడ్డాడు సదాశివం. వెనక్కి తిరిగిచూస్తే చలమయ్య! స్తబ్ధుగా ఒక కుర్చీ మీద కూచున్నాడు. రాజారావు లేడు! నిర్ఘాంతపోయాడు సదాశివం.

'ఏంరా చలమయ్యా! ఎలా వచ్చావిక్కడికి?' అన్నాడు సదాశివం.

ఉలకడు పలకడు చలమయ్య.

ఇదేదో రాజారావు చేసిన తమాషా అని అనుకోడంవల్ల సదాశివం భయపడలేదు.

'ఒరేయ్ చలమయ్యా నోరు విప్పుతావా? విప్పవా?'

'—'

'ఒరేయ్ నిన్నే. నువ్విప్పుడెవరో తెలుసా. నా కథలోని పాత్రవి!'

'—'

'విలన్‌వి!'

'—'

'పోనీలేరా బాబూ నువ్వే హీరోవి!'

అప్పటికీ పెదవి మెదపలేదు చలమయ్య.

ఇంతలో రాజారావు వచ్చాడు. పగలబడి నవ్వుతున్నాడు—

'ఒరేయ్ సదాశివం! నీకథాశివం వల్లకాటికి చేరింది. ఇప్పుడే పోసేసి వస్తున్నా. చూశావా పాపం వసుమతి చలమయ్యను వుడ్‌లాండ్స్‌లో వదిలేసిపోయింది! చలమయ్య మదరాసునుంచి తిరుగు టపాలో వచ్చేశాడు!'

సదాశివానికేమీ అంతు పట్టకుండావుంది.

## 4

మందురోజు పశుపతికి జన్మదినం గాని వసుమతి జన్మకది చరమదినం కావలసింది. ఆవేళ రాత్రి పార్టీ అయాక అందరూ వెళ్ళిపోయాక పశుపతి గదిలో వసుమతి ఆవేళే వచ్చిన క్లబ్బు మెంబర్ల గ్రూపు ఫోటోగ్రాఫు చూసి అందులో రాజారావునైపు చూపిస్తూ 'మీఅందరిలోనూ ఈయనమాత్రం మాంచి రీవిగా చక్కగా పడ్డారండీ!' అంది. అంతే. రాత్రంతా పెద్ద రంధి అయిపోయింది. పశుపతి ఆమెను చావబాదేడు, చితగ్గొట్టేడు, కుళ్ళబొడిచాడు. బాదబాది అలిసి నిద్రపోయాడు మహానుభావుడు. ఆమెకి పాపం నిద్రెలా పడుతుంది! కీలుకీలునా రక్తం కగుములుగట్టి ఒళ్ళంతా సళిపరిస్తోంది. ఆ సలుపులు భరించలేక పెరట్లో బావిదగ్గరికి పరిగెత్తింది. ఆమె బావిలో దూకబోతూవుంటే వసారాలో పడుకున్నాని ఇదంతా గమనిస్తూవున్న చలమయ్య దూరాన్న వెళ్ళి ఆమె రెక్క పట్టుకున్నాడు. ఆమె 'ఈ రాక్షసుడి యింట్లో ఇంక ఒక క్షణం వుండ'నని, తన్ను చావనిమ్మని చలమయ్యని బతిమాలుకుంది, పాపం. చలమయ్య నిలువెత్తున నీరైపోయి వెంటనే ఆ రాత్రికిరాత్రి రాజారావు వెంకట్రావుల లాడ్జికి ఆమెను కూడా తీసుకుపోయి సంగతంతా చెప్పేడు. రాజారావు వెంకట్రావుని ఆమెను పుట్టింట దిగవిడిచిరమ్మని తెల్లవారుజామున రైల్లో ఇద్దరిని పంపించాడు. చలమయ్య స్టేషనుకి వెళ్ళి సాగనంపి వచ్చాడు. చలమయ్యను అందాకా తన లాడ్జిలోనే వుండమని బలవంతం చేశాడు రాజారావు. ఉన్నాడు చలమయ్య.

* * *

సంగతంతా తెలుసుకున్నాడు పాపం సదాశివం.

'వసుమతి నిజంగా ఎవరితోనో లేచిపోయినా బాగుండు!' నన్నాడు.

మందహాసం చేశాడు రాజారావు. చలమయ్య గిటో.

సదాశివం మళ్లా 'పదండి వెళ్ళి పశుపతిని చితకబొడదాం!' అన్నాడు ఆవేశంతో.

'డామిట్! ఇప్పటికి అతి నాటకీయమైన నీకథ అర్థంగా తిరిగింది. ఈ నాటకీయ సన్నివేశాన్ని కూడా మరీ అర్థంగా తిరిగిపోనివ్వకు. కథానాయకుడు పశుపతి!' అని హెచ్చరించాడు రాజారావు నవ్వుతూ.

# మరిది తెచ్చిన మార్పు

కొత్త సీత

చి॥ సౌ॥ చెల్లెలు శాంతకు

అక్క ఆశీర్వదించి వ్రాయునది.

నీ ఉత్తరం అంది నాలుగు రోజులయింది. అప్పటినుంచి జవాబు వ్రాద్దామనుకుంటూనే వున్నాను, కాని నేటివరకూ తీరుబడి కాలేదు. మీ బదిలీ ప్రయాణం క్షేమంగా జరిగిందని తెలుసుకొని సంతోషించేను. పెనుగొండ నీళ్లు నీకు కొత్త చేస్తాయేమోనని భయపడ్డాను. కాని మీరంతా కులాసాగా ఉన్నారని చదువుకొని ఆనందించేను నన్నొకసారి చూడ్డానికి రమ్మనమని వ్రాసేవు. అక్కడ మీరింకా స్థిరపడ్డానికి కొన్నాళ్లు పట్టుతుంది-కదా. ఈ లోపులో మా పిల్లల పరీక్షలు కూడా పూర్తవుతాయి. అప్పుడు తప్పక వస్తాను.

మీ ఆయన మమ్మల్ని మరచిపోకుండా ఈ ఆహ్వానం పంపినందుకు సంతోషించేమని చెప్పు. మరీ మరీ అడిగేనని కూడా చెప్పు. కొత్త ఊళ్లో ఉద్యోగాన్ని గురించి అతనేమంటున్నారు? ఆ వూరి విశేషాలు కూడా వ్రాయి.

బుజ్జాయికి నా ఆశీర్వచనాలు. అన్నప్రాశన ఎప్పుడు చేస్తారు? వాడికెన్ని ఏళ్లు వచ్చాయి? మా చిట్టి కిప్పుడే పళ్లు



తెస్తున్నాయి. దాని నోట్లో నియ్యని గరిటెల్లాగ కొద్దిగా కనిపిస్తున్నాయి. అది చేసే అల్లరి ఇంతా అంతా కాదు. అందర్నీ నోట్లో వేలుపెట్టమని మారాము చేస్తుంది. మొన్న మా మరిది కాలేజీ సెలవులకి ఇంటికి వచ్చినప్పుడిల్లానే వేధించుకు తింది. మేము వద్దంటున్నా వినకుండా అతను నోట్లో వేలుపెట్టేటప్పటికి మామూలు ప్రకారం కటుక్కున నొక్కింది. అసలే విసుగు మనిషి. అతనే మంటాడో అని మేం భయపడ్డాం. కాని అతడెంతగా మారిపోయాడో. ఎంత విజ్ఞానవంతుడయ్యాడో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. నీకు తెలుసుకదా. ఎప్పుడూ పెంకితనంగా చిరాకుగా ఎల్లా వుండేవాడో! ఇప్పుడంతా వేరు. చిట్టిని ఒళ్లో కూర్చోపెట్టుకొని బోలెడంత సేపు ఆటలాడేడు. చిట్టికి ఆహారంలో తగినన్ని విటమినులు లభించడం లేదనీ పెరుగుదల రోజుల్లో విటమినులు శరీరానికి ప్రత్యేకించి అవసరమనీ అన్నాడు. "ఇంకా పట్టా పుచ్చుకోవడానికి ఏడాది వుండగానే డాక్టరులాగ మాట్లాడకోయ్" అని నేను వేళాకోళం చేసేను.

మరునాడు నాకు కొంచెం నుస్తీగావుండి వంట చెయ్యలేకపోయాను. మీ బావగారు హోటలు భోజనం తెప్పించమని తమ్ముడికి పురమాయించేరు. "నేనుండగా హోటలు భోజనమా!" అంటూ అతను వంటకి పూనుకొన్నాడు. పట్నంలో భోజనం వసతి ఆలనా కొరతకు కాలేజీ కుర్రాళ్లూ కలిసి "మెస్" ఏర్పాటు చేసుకొని వాళ్లకు కావలసిన వంటకాలు కావలసినట్లు చేసుకొంటున్నారట.



తర్ఫీదు బాగానే అయ్యేదేమో, వాళ్ల అన్నగారు అతని వంటని ఒకటే మెచ్చుకోవడం.

మర్నాడు మా మరిది వంటింట్లో నా దగ్గరే వుండి వంటలో తాను అనుభవం మీద నేర్చుకున్న అనేక విషయాలు చెప్పేడు. నాకు చాలా చిన్నతనం వేసింది. చెప్పొద్దూ! మరిది చెప్పడం, నేనలా చేస్తూండడం, మీ బావగారు మధ్య మధ్య నన్ను వేళాకోళం మాటలంటూండడం! —అల్లా నడిచిందా వేళ వంటింటి వ్యవహారం. అతను ప్రతిదానికీ 'డాల్డా' వాడడం చూస్తే నాకుమల్లే మా వారికీ ఆశ్చర్యం వేసింది. మా ఇంట్లో అంతవరకూ 'డాల్డా' పిండి వంటలకి మాత్రమే వాడే వాళ్లం. మా మరిది, మన రోజూ ఆహారంలో తగినంతగా పోషక పదార్థాలుండాలనీ, 'డాల్డా' శరీరారోగ్యానికి అవసరమైన పోషక పదార్థమే కాక దానిలో చేసిన వంటకాలెంతో స్వాదిష్టంగా వుంటాయనీ చెప్పేడు. ప్రతి ఔన్సు 'డాల్డా'లోనూ 700 అంతర్జాతీయ యూనిట్ల విటమిన్ 'ఏ' 56 అంతర్జాతీయ యూనిట్ల విటమిన్ 'డి' కలుపుతారనీ అందుచేత 'డాల్డా' వంట నూనెల కంటె శ్రేష్ఠమని అన్నాడు. అటువంటి 'డాల్డా' పిండివంటలకే గాక నిత్యకృత్యాలలో వంటలన్నిటికీ మహారాజులాగ వాడుకోవచ్చునని తన అనుభవం అని కూడా చెప్పేడు.

ఆహారాన్నీ, శరీర పోషణనీ, బిడ్డల పెంపకాన్నీ గురించి కూడా బోలెడు విషయాలు చెప్పేడు. అన్నీ తెలిసియున్న మనిషి డాక్టరులాగ మాట్లాడేడంటే ఆశ్చర్యమేముంది! "ఏడాది ఆగక్కర్లేకుండానే నీకు డాక్టర్ పదవి ఇచ్చెయ్యొచ్చునోయ్" అన్నాను నేను.

ఈ సంఘటన వ్రాసేక నువ్వుకూడా రోజూ వంటలన్నిటికీ 'డాల్డా'నే వాడమని వేరే వ్రాయాలా! కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో: విడిగా దొరికే వనస్పతిని 'డాల్డా' అని అమ్ముతూవుంటారు. జాగ్రత్త. అల్లాంటి వనస్పతిలో మురికి కలవడానికీ, ఈగలు వాలడానికీ, అవకాశం వుంటుంది. 'డాల్డా' మాత్రం పరిశుద్ధంగా సీలువేసిన డబ్బాలలో దొరుకుతుంది. ఖర్జూరపు చెట్టు బొమ్మ వేసిన పసుపు పచ్చటి డబ్బాని గుర్తుంచుకో.

మా మరిది నేర్పిన కొత్త వంటకాలు ఈసారి వ్రాసి పంపుతాను. పెనుగొండ విశేషాలూ, మీ అందరి క్షేమం త్వరలో వ్రాయి.

మరి ఉంటాను,

ప్రేమతో మీ అక్క కమల

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారిది.

DL/P.IB-352 TL

# ★ లేచినవేళ ★

పొదుపూ వస్తుంది మీకు!"

"రోజూ పేకాటలో పోతుందని ఎవరు చెప్పారు నా రాణీ!"

"క్లబ్బునుంచి తిరిగొచ్చేక మీ మొహమే చెబుతుంది."

"ఎలాగైనా సూక్ష్మగ్రాహివి. నీ దగ్గిర సత్యం దాగుతుందా! చూడు... నే నోమూల రోజూ పేకాడి డబ్బు తగలేస్తుంటే కాస్త నువ్వయినా పొదుపుగా వుండాలి. మరి నువ్వు కూడా ఇలా దుబారా ఖర్చులు మొదలెడితే మన సంసారం గతేంకానూ! ఏమంటావ్."

"ఇంతకీ మీరు కొనితెస్తారా లేరా?"

"లేకపోతే?"

"నా డబ్బుతోనే కొనిపెడతాను."

"శుభం. అలా చెయ్యి."

"అంతేలెండి. మీ కింతకంటే అభిమానం వుంటుందనుకోవడం నాదే తెలివితక్కువ. ఇదే మీ అక్కయ్యైతే..."

"ఓ స్తే?..."

"మధ్య నాకెందుకు. మీ ఇష్టం మీది."

"ఆ పేలికలో పూర్తిగా పేలు."

"ఇదేమిటండీ. నే నేమన్నానని? నా మీదింగుడు విరుచుకుపడతారూ!"

"నువ్వన దలుచుకున్నది పైకంటే నాలిక కోసేసుండేవాణ్ణి."

"నాలికో కోస్తారు. కోకా నులిమేస్తారు. బాగుంది వరస. మా అక్కయ్యకో చీర కొనమని ప్రాధేయపడి అడుగుతే ముద్దుగా వున్నాయి మాటలు."

"చీరాలేదు గాడిద గుడ్డూ లేదు."

"పోనీండి బాబూ మీకో దణ్ణం. మీరేమీ కొనావద్దు, పెట్టావద్దు. వచ్చినవాళ్ళని మర్యాదగా వెళ్ళనివ్వండి."

"నా కసలు వాణ్ణి చూస్తేనే ఒళ్ళు మంట."

"ఎవర్ని చూస్తే!"

"మీ బావగాడు. రాచ్చిప్పలా మొహం వాడూను. పుట్టినతర్వాత ఎప్పుడేనా నవ్వేడా అని. అసలు వాడు మాట్లాడుతుంటేనే మీద గొంగళీపురుగులు పాకుతున్నట్టుంటుంది. కిందటిసారి పండుగుల్లో వీడు నాకో ధర్మోపన్యాసం! సిగరెట్లు మానెయ్యాలిట. సినీమాలు చూడకూడదుట. పేకాట మహాపాపంట. వీడిలాగే పెళ్ళాం కొంగట్టుకుని అందరూ తీర్థయాత్రలు చెయ్యాలనిలా గుంది వీడిమతం. ఫూల్."

"ఔవ్వ! ఔవ్వ! ఇదేం ఘోరమండీ! మీ నోటికెంతొస్తే అంతమాట అనేస్తారు కూడాను."

"ఏం. నాకేం భయమా. నా కేమైనా పెట్టి పోషిస్తున్నాడా. ఈ సారి అలాంటి కూతలుకూస్తే తంతాను కూడాను."

"నిజంగా అంత రాద్ధాంతం చెయ్య దలుచుకుంటే వద్దని ఒక్క టెలిగ్రాం యిచ్చెయ్యండి. ఎంత అప్రదిష్ట! ఎంత అప్రదిష్ట!"

"నేను టెలిగ్రాం యివ్వడ మెందుకూ. తన్నులు తప్పే యోగముంటే వాడే రాడు."

* * *

రాత్రిభోజనం నిశ్శబ్దంగా ముగిసింది. మధ్యాహ్నం జరిగిన గందరగోళానికి తెంపలేసుకుని రాజీపడతానని మా ఆవిడ భ్రమ. వక్కపొడి నోట్లోపోసుకుని పత్రిక చేత్తో పట్టుకుని మంచంమీద నడుం వాల్చేను. మంచినీళ్ళ మరచెంబు బల్లమీదుంచి, నిలువుటద్దంముందు నిలబడి పౌడరు మొహానికి పూసుకుని, తన అందానికి తనే మురిసిపోతూ, బారెడు మల్లెపూలదండ మెలికలు చుట్టి తలలో తురుముకుని, ఒక్కసారి నిట్టూర్చి వసారాలో వున్న మడతమంచం తెచ్చుకొచ్చి చంటిపిల్లాడి మంచంపక్కనే వాల్చుకొని "పెళ్ళాళ్ళయింది నొక్కులు తెగిపోయి. కొత్త అతిగించి తెచ్చిపెట్టేదిక్కు లేదు" అంటూ అలకపాన్పు నధిష్ఠించింది. గుడఆడదానికి అంత పంతముంటే నాకెనా లేనిది. ఏమయినా నేను మెత్తబడ దలుచుకోలేదు.

అసలు ఆలోచిస్తున్నకొద్దీ మానవలోకంలో సుఖాన్నన్న మొగాడి ప్రాణాన్ని దుఃఖాన్ని పెట్టడానికే ఈ ఆడది అవతరించిందేమో ననిపిస్తుంది. అందుకు సాయం ఈ పెళ్ళనే సాంఘికదురాచారమొకటి. దీనితో ప్రతీ మొగాడూ మీసాలు దువ్వుకుంటూ పెళ్ళాడటం. దాని తర్వాత యావజ్జన్మ సంసార కారాగార మనుభవించడం. మొగాడికి ఆడదెంతవసరమో అంతకి రెట్టింపు ఆడదానికి మొగాడవసరం. పోషించడమనే అదనపు బాధ్యత మొగాడిది కనక. ఇంక జనాభా లెఖ్ఖచూసినా పురుషులే తక్కువ. అన్ని విధాలుగానూ ఎంతో గిరాకీగా వుండవల్సిన మొగాడు తీరి కూర్చుని కొరివితో తల గోక్కున్నట్టు, అనాదిగా యీ ఆడదాన్ని నెత్తికెక్కించుకున్నాడు. ఇప్పుడు ఈ ఆడదే ఏకు మేకై కూర్చుంది. రోడ్డుమీద ఆడది కనబడితే ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఎగాదిగా చూడని మొగాడు లేడు. ఆడదాని బొమ్మ కనబడితే జాగ్రత్తగా తీసుకెళ్లి ఇంట్లో గోడకి తగిలించని వాడు కనబడడు. అసలు అక్షరాభ్యాసమయిన మర్నాడే లవ్ లెటర్లు రాయడం ప్రారంభించడం, పుస్తకం పట్టిన మూడో రోజున ప్రేమగీతాలు రాయడం పరిపాటయిపోయింది. ఆడదాని అందాన్ని పొగడని కవిగాని, రచించని చిత్రకారుడుగాని, చెక్కని శిల్పిగాని, గానంచెయ్యని గాయకుడుగాని మచ్చుకు కనబడడు. ఈ అనర్థానికి కారణం ఈ కళాకారులందరూ మొగాళ్ళవడంవల్లనే అనుకుంటాను. నిశితంగా పరిశీలిస్తే ప్రకృతిలో పురుషునకున్న అందం స్త్రీకి లేదు. మానవుడన్న మాటేమిటి ఈ సత్యం జంతువుల్లో కూడా కనబడుతుంది. మొగసింహాన్ని ఆడసింహాన్ని కాని, ఆంబోతుని ఆవుని కాని, మొగనెమల్ని ఆడనెమల్ని కాని, కోడిపుంజుని కోడిపెట్టని కాని చూస్తే వేరే ప్రత్యక్ష నిదర్శన మక్కర్లేదు. పురుషుని శరీరంలోవున్న సొగసూ, శక్తి, గాంభీర్యం స్త్రీ కెక్కడుంది. ఆడదానికి అందమేమైనా వుంటే అది పురుషుడు కొంత తెచ్చిపెట్టిందీ, కొంత తన కామచక్షువులతో చూసి వ్యాఖ్యానం చేసింది. అష్టవంకర్లుగానూ వున్న ఆడదాని శరీరాన్ని

(41-వ పేజీ చూడండి)



అలాస్కా, ఉత్తర అమెరికాలో వాయవ్యదిశను ఉన్న ఒక ద్వీపకల్పం 5,86,100 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల ఈ ప్రదేశం గుర్గమారణ్యాలతోనూ, హిమగిరులతోనూ నిండి ఉంటుంది

ఇటీవలనే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో అలాస్కా 49వ రాష్ట్రంగా చేరింది అలాస్కాలో కనపడు పాకివచ్చే దట్టమైన అడవులు ఉన్నవి వీటిలోని మడుగులు, సరస్సులు, నదులు మొదలయిన వాటిలో చేపలు పుష్కలంగా దొరుకుతాయి ఉత్తరానికి పోను పోను గ్లేషియర్స్ గల పర్వతాలు, మంచుతో కప్పిన టండ్రా భూములు గల ఆర్కిటిక్ ప్రాంతం కనుపిస్తాయి

అలాస్కాను చీల్చుకొంటూ ప్రవహించే నదులలో బంగారంకోసం ఒకప్పుడు ఇక్కడ చాలమంది తీవ్ర ప్రయత్నాలు చేస్తూండేవారు ఈనాడు చేపల వేటకు దూరప్రాంతాలనుంచి ఎంతోమంది వస్తూంటారు

ఇక్కడి హిమమయ పర్వతప్రాంతం కన్నులపండువుగా వుంటుంది ఉత్తర అమెరికా ఖండంలో కల్లా ఎత్తయిన మాకిన్లీ శిఖరం (20,320 అడుగులు) ఇక్కడే ఉన్నది అప్పుడప్పుడు అగ్నిజ్వాలలు సైతం వెళ్ళగ్రక్కుతూ పరిసర ప్రాంతాలవారిని భయకంపితులుగా చేస్తుంటుంది 20 అగ్నిపర్వతాలుకూడా ఇక్కడ ఉన్నాయి

అలాస్కా సమీపాన ఉత్తర పసిఫిక్ మహాసముద్రంలో వెయ్యిమైళ్ళ వరకూ వ్యాపించి ఉన్న అల్యూషియన్ దీవులుకూడా ఈ రాష్ట్రంలోనే ఉన్నాయి బేరింగ్, బ్యూఫోర్ట్, తూర్పు సైబీరియా, సముద్రాలు మూడు ప్రక్కల గల ఈ ద్వీపకల్ప తీర ప్రాంతం 33 904 మైళ్ళు

ఎస్కిమో ఆచార్యుడు విద్యార్థికి బొమ్మలద్వారా చదువు నేర్పుతున్నాడు



ఈ రాష్ట్రం ఉత్తరదిశను ఆర్కిటిక్ మహాసముద్రం, తూర్పు కెనడా, నైఋతి దిశను పసిఫిక్ మహాసముద్రం, పడమరను బేరింగ్ సముద్రం, ఆర్కిటిక్ మహాసముద్రం ఉన్నాయి అలాస్కా, ఆసియాల మధ్య దూరం 54 మైళ్లు మాత్రమే అమెరికాకు చెందిన లిటిల్ డయమేడ్ దీవికి రెండు మైళ్ళదూరంలోనే రష్యాకు చెందిన బిగ్ డయమేడ్ దీవి ఉన్నది

## ఖనిజ సంపదలు

అలాస్కా రాష్ట్రపు మొత్తం వైశాల్యంలో నూరింట రెండుపాళ్లు భూమిని మాత్రమే భూగర్భ శాస్త్రజ్ఞులు ఇంతవరకు పరిశోధించగలిగారు ఇంకా పరిశోధనలు జరుగుతున్నవి యురేనియం, ప్లాటినం, తగరం, సీసం, బొగ్గు, నికెల్, పాదరసం, రాగి, క్రోమైట్, తుత్తునాగం, వెండి మొదలైన 30 ఖనిజాల వరకు దొరికాయి అలాస్కన్ పర్వతాలలో పెద్ద ఎత్తున లోహం దొరుకుతున్నది పెట్రోలియం, నేచురల్ గ్యాస్ కోసం తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నాయి

మత్స్యపరిశ్రమ, అలాస్కా ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక వంటిది ఈ ప్రాంతానికి ప్రపంచపు "సాల్మన్ కాపిటల్" అని పేరు వచ్చిందంటే సాల్మన్ చేపలు ఎంత విరివిగా దొరుకుతాయో విదితమవుతుంది సాల్మన్, హాలిబట్ హెర్రింగ్, క్లామ్స్, క్రాబ్ చేపలు, రొయ్యలు నిలవచేసి ఎగుమతి చేసే కానరీలు దాదాపు 80 పని చేస్తున్నాయి

అలాస్కాలో యాంకరేజ్, ఫెయిర్‌బ్యాంక్స్, కెచ్చికన్, జునావ్, నోమ్ పాయింట్ బారో ముఖ్య నగరాలు, వీటిలో జునావ్ అలాస్కా రాష్ట్రానికి రాజధాని.

## ఎస్కిమోలు

అలాస్కాలో దాదాపు 16,000 మంది ఎస్కిమోలున్నారు. వీరు పెద్ద పెద్ద నది తీరాలలోను, కోస్తా ప్రాంతంలోను రాష్ట్రం అంతటా చెదురుగా నివసిస్తున్నారు.

అయితే ఎక్కువభాగం డెల్టా ప్రాంతాలలోనో, బ్రిస్టల్ అఖాతప్రాంతంలోనో ఉన్నారు. ఇక్కడ చెట్టుచేమలు ఉండవు. భోరున గాలి ఎప్పుడూ వీస్తూంటుంది. ఉష్ణోగ్రత సున్నా డిగ్రీకంటే కూడా ఇంకా తక్కువకు పడిపోతూ ఉంటుంది. వేసవి అనేది కొద్దికాలం పాటు మాత్రమే ఉంటుంది. అందువల్ల ఇక్కడ నివాసం ఏర్పాటు చేసుకోవటం కష్టం. ఎస్కిమోలు ఈ పరిస్థితులను తట్టుకొని ప్రకృతిని ఎదిరించి అక్కడ స్థిరంగా ఉండగలుగుతున్నారు. సముద్రంలో దొరికే వ్హేల్స్, సీలు, తిమింగిలం, సాల్మన్ చేపలు వగైరా వీరికి ఆహారం అంతే కాదు. ఈ జలచరాలనుండి తీసిన దుస్తులను, వంటకు, దీపాలకు కావలసిన నూనెను కూడా వీరు తయారు చేసుకొంటారు. పరికరాలు, ఆయుధాలు సైతం వీరు ఈ జంతువుల అవయవభాగాలతోనే చేసుకొంటారు. వీటిని పట్టుకోటంలో వీరికి గల ప్రజ్ఞవల్లనే ఎస్కిమోలది ప్రపంచంలో వేటలో అందెవేసిన చేయి అని ప్రసిద్ధి కెక్కింది.

ఎస్కిమోలకు ఒకచోట నిలకడగా ఉండకుండా తిరిగే అలవాటు ఇంగువల్లనూ, వేటలవల్లనూ, జీవనయాత్రలో సుదీర్ఘమైన ప్రయాణాలు చాలా పెద్ద బరువులతో చేయటంలోనూ, ఎదురైన రవాణా సమస్యను కుక్కలచేత లాగించే స్లెడ్జిబండ్ల సృష్టి ద్వారా పరిష్కరించుకోగలిగారు. ఇవి నేటికీ వాడుకలో ఉన్నాయి. ముఖ్య అవసరాలకు ఎస్కిమోలు తోలు పడవలు తయారు చేసుకొంటారు.

### సామూహిక జీవనం

కలిసి మెలిసి జీవించటమంటే ఎస్కిమోలకు ఇష్టం. బృందగానాలు, నృత్యాలు వంటి వేడుకలు చేసుకుంటారు. పండుగలన్నా, కథలు చెప్పటమన్నా, ఆటలన్నా వాళ్ళకు ప్రీతి. ఎస్కిమో డప్పు వీళ్ళకు అభిమానపాత్రమైన సంగీత వాద్యం. ఇది కంజరిలాగా తోలుతో తయారు చేస్తారు. అన్ని కాలాలలోను చుట్టుపక్కలు రావటం పోవటం పరిపాటిగా వుంటుంది. ఎస్కిమోలు పలువురు కలిసి చేసే పనికైనా గ్రామపాఠశాల కేంద్రంగా వుంటుంది. పాఠశాలల్లో విద్యా, సాంస్కృతిక, సామాజిక వేడుకలు జరుపుతుంటూ వుంటారు. యువజనులు ఆటపాటల (నృత్య సంగీతాలు) తో వినోదకాలక్షేపాలు చేస్తుంటారు. ఎస్కిమో గ్రామాలలో యోచనతో చక్కగా కట్టిన వ్యవసాయగృహాలు కనబడతాయి. వేడిమి కోసం నూనె ఉపయోగిస్తారు.



అలాస్కా జనాభా 2 లక్షల పదివేలు. ఎస్కిమోలు, అల్యూట్‌లూ, ఇండియన్లూ కాక ఇక్కడ స్థిరపడ్డ నార్వేజియన్లూ, స్వీడిష్ ప్రజలూ నూరింట ఒకవంతు ఉన్నారు. ఇక్కడ పౌరులకు 19 ఏటనే ఓటు హక్కు లభిస్తుంది

### వస్త్రధారణ

పూర్వం ఎస్కిమోలు అందరూ చర్మాలనే వస్త్రాలుగా చేసుకుని కట్టుకునేవారు. కణితి (జింక) చర్మం, ఉడుతచర్మం ఇందుకు ఉపయోగించేవారు. పైన వదులుగా వుండే అంగరకా వేసుకొంటారు. దీనిని పూర్వం చర్మంతో చేసేవారు. పెద్ద దుప్పటిలాగా ఉంటుంది. తలకు తగిలించటానికి మధ్యలో రంధ్రం చేస్తారు. ఇప్పుడు ఉన్నితో తయారు చేస్తున్నారు. దీనిని "పార్కా" అని "పాంచో" అని అంటారు. దీనికి భుజాలమీద వేసుకోటానికి వీలుగా పడగలలాంటివి వుంటవి. చలిగా వుంటే చెవులకు వీటిని కప్పుతారు. వెచ్చగా ఉన్నప్పుడు ప్రక్కలకు వేస్తే భుజకీర్తులలాగా వుంటవి. ఇప్పుడు ఉన్ని, నూలువస్త్రాలు కూడా ఉపయోగిస్తున్నారు. ఈనాడు చాలామంది ఎస్కిమోలు కూడా పాశ్చాత్య వేషంలో కనపడతారు.

ఎస్కిమోలు దృఢకాయులు. సాధారణంగా పొట్టిగా బరచగా వుంటారు. గుండ్రని తల, పొట్టిగా, దృఢంగా ఉండే పాదాలు, అరచేతులు, వెడల్పాటి ముఖం కొంతవరకు వీరిలో ఆసియావాసుల పోలికలు కనబడుతుంటవి. మగవాళ్ళు వేటాడటం, ఉన్ని అల్లికలవంటి పనులు చేస్తారు.

### సౌకర్యాలు

ఎస్కిమోలకు ప్రజారోగ్యం, విద్య, గృహ రావాసం, పనులు చూపటంవంటి రంగాలలో ప్రభుత్వం తోడ్పడుతుంటుంది.

అమెరికా ఫెడరల్ (కేంద్ర) ప్రభుత్వం అలాస్కాలో 8 జనరల్ ఆస్పత్రులూ, అనేకం బయటిరోగులకు వైద్యం చేసే కేంద్రాలు నెలకొల్పింది. ఇంకా నీటిపారిశుద్ధ్యం, చెత్తకాదారం ఎత్తివేసే ఏర్పాట్లు, టీకాలవంటి రోగనిరోధక చర్యలు తీసుకొంటూవుంటుంది. పాఠశాలలు కూడా చాలా నెలకొల్పారు.

(48 వ పేజీ చూడండి)



# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

మధ్యాక్కర. ఘనపాశములఁ జేసి యొల్లయంగముల్ గలయ బంధించి
కొని యొక్కనదిఁ జొచ్చి మునిఁగినను వంతఁ గూఁకి యన్నదియుఁ
దనదివ్యశక్తి నప్పాశముల విడిచి తన్మునినాథుఁ
బనుగొనఁ దీరంబు సేరఁ బెట్టె విపాశ నాఁ బరఁగె.

వ. ఇట్లు పెక్కువిధంబుల శరీరపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుండయ్యును స్వప్రాప్తమరణుం డయి వసిష్ఠుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు దనపిఱుంద వచ్చు కోడలి నదృశ్యంతి యనుదాని శక్తిభార్య నప్పు డెఱింగి దానియుదరంబుననుండి షడంగాలంకృతవేదధ్వని గరంబు మధురంబై వీతెంచిన విని విస్మితుండయి.

తే. శక్తిచదువునుబోలెను వ్యక్తమగుచు, వీనులకు నిది యమృతోపమానమయ్యె
వేదనాదంబు దీనిపుణ్యోదరమున, నున్నవాఁడు సుతుండు విద్వన్నుతుండు.

వ. అనవరత వేదాధ్యయనశీలుం డయినశక్తిచదువువినుచుం బండ్రెండేఁడులు గర్భంబుననుండి సకలవేదంబులు ధరించినవాఁ డీపౌత్త్రిముఖంబు సూచి యేను గృతార్థుండ నగుదు నని వసిష్ఠుండు మరణవ్యవసాయనివృత్తుండై నిజాశ్రమంబున నుండునంత నొక్కనాఁడు రాక్షసరూపధరుండై రౌద్రాకారంబున వచ్చు కల్మాషపాదుం జూచి యదృశ్యంతి వెఱచిన దాని నోడకుండు మని మునివరుండు హుంకారంబున రాక్షసు వారించి వానిపయి మంత్రపూతంబులైన కమండలు జలంబు లొలికిన.

### వసిష్ఠువలనఁ గల్మాషపాదుండు శాపవిముక్తిఁ బొందుట

క. భూపాధముండు బ్రాహ్మణ, శాపంబునఁ బదియు రెండు సంవత్సరముల్
పాపమతి నుండి రాక్షస, రూపము చెడి యధిపుఁడు మనుజరూపముఁ దాల్చెన్.

వ. ఇట్లు శాపవిముక్తుండై కల్మాషపాదుండు వసిష్ఠునకు నమస్కరించి ముకుళితకరకమలుండై మునీంద్రా నీప్రసాదంబున శాపంబువలనం బాసి కృతార్థుండ నయితి ననిన వానికి వసిష్ఠుం డిట్లనియె.

చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడ వై సమస్తధా
రుణీప్రజ గూర్పఁగా విగతరోషుఁడ వై సుఖ ముండు మింక బ్రా
హ్మణుల కవజ్ఞ సేయక శమత్వము సేకొను మింద్రుఁడైన బ్రా
హ్మణుల కవజ్ఞ సేసి యవమానముఁ బొందుఁ బ్రతాపహీనుఁ డై.

వ. అని కఱపిన నట్లచేయుదు నని యమ్మహీపతి వసిష్ఠుం దోడ్కొని యయోధ్యాపురంబున కరిగి సకలప్రజానురాగకరుం డయి యమ్మునివరు నతిభక్తిం బూజించుచుఁ దొల్లి రాక్షసుం డయి మదయంతీసహితంబు వనంబునం గ్రుమ్మరియెడి కాలం బొక్కబ్రాహ్మణమిథునంబు ఋతుకాలప్రవృత్తి నున్నం గని యాఁకంటి పెల్లున నందు బ్రాహ్మణుం బట్టికొని భక్షించిన నతిదుఃఖితయై బ్రాహ్మణభార్య పరమపతివ్రత యాంగిరసి యనునది పురుషవియోగంబునం బుత్త్రార్థం బయిన నిజప్రయత్నంబు విఫలం బగుటకు శోకించి వనితాసంభోగంబున నీవును నా పురుషునట్ల పంచత్వంబునం బొందుమని శాపంబిచ్చి వసిష్ఠువలన నీకుఁ బుత్త్రలాభం బగునని చెప్పి యగ్నిప్రవేశంబు సేసినం బదంపడి దీనినంతయు మదయంతివలన నెఱింగినవాఁడై తనకుఁ బుత్త్రోత్పాదనసామర్థ్యంబు లేమిఁ దలంచి కల్మాషపాదుండు పుత్త్రార్థి యయి వసిష్ఠున కిట్లనియె.

క. మనుకులపవిత్రుఁ బుత్త్రుకు, నినసన్నిభు నాకుఁ బడయు మీ నెట్లయినన్
మునినాథ నీప్రసాదంబునఁ బితరులవలన ఋణవిముక్తుఁడ నగుదున్.

వ. అని తనభార్యయైన మదయంతి యనుదానిని ఋతుమతి సమర్పించిన నదియు వసిష్ఠప్రసాదంబున గర్భిణి యయి పండ్రెండేఁడులు గర్భంబు మోచి పేసరియొక్క యశ్మశకలంబున నుదరభేదనంబుఁ జేసిన నశ్మకుం డనురాజర్షి పుట్టెనట యదృశ్యంతికిం బరాశరుం డుదయించి వసిష్ఠనిర్మిత జాతకర్మాదికుం డయి పెరుగుచు నొక్కనాఁడు రాక్షసభక్షణంబునం దనజనకు పంచత్వంబు దల్లివలన విని కోపదహనదందహ్యమానహృదయుం డయి తపోమహత్త్వంబున నఖిలలోక సంహారంబు సేయుదు నని యున్న మనుమని వారించి వసిష్ఠుం డిట్లనియె.

సీ. వినవయ్య కృతవీర్యుఁ డను జనపతి తొల్లి, భృగువంశ్యయాజ్యుఁడై పెక్కుక్రతువు
లొనరించి యగణిత ధనదానముల వారిఁ, దృప్తులఁ గావించి దివికిఁ జనిన
నతనివంశమునవా రతిధనలుబ్ధులై, కృతవీర్యుధన మెల్లఁ గ్లుప్తి సేసి
కొని డాఁచి యున్న వా రనిభార్గవుల నెల్లఁ, బలికిన భార్గవుల్ భయమువొంది

తే. కొంద ఱర్థము వారికిఁ గూర్చి యిచ్చి, రవనిసురవంశ్యులకు నిచ్చి రందుఁ గొంద
ఱెవ్వరికి నీక తమతమ యిండ్లఁ బాఁతి, కొని సుఖంబుండి రధములై కొంద ఱందు.

వ. అంత నాక్షత్త్రియు లొక్కభార్గవునియిల్లు గ్రొచ్చి యనంతం బయినయర్థంబుం గని యలిగి రాజధనవంచకులైరని భార్గవుల నెల్ల నిగ్రహించి గర్భంబుల నున్న యర్భకుల మొదలుగా వధియించిన వెఱచి భార్గవులభార్యలెల్ల హిమవంతంబునకుం బాఱిన నందొక్క భృగుపత్ని భయంపడి తనయూరుదేశంబున గర్భంబు ధరియించిన నెఱింగి క్షత్త్రియులు దాని భేదింప నమకట్టి వచ్చిన నంతఁ గుమారుండు.

క. భువనోపప్లవసమయో, ద్భవభానునిభప్రభావభాసితుఁ డయి భా
ర్గవుఁ డూరుదేశమునను, ద్భవించె మహిఁ వెలుఁగుచుండఁ బ్రభుఁ డౌర్వుఁ డనన్.

మ. అమితోజుం డగువానిఁ జూచి కృతవీర్యాన్వయక్షత్త్రియా
ధము లెల్లన్ హతదృష్టులై కృపణతం దత్సర్వతారణ్యదే
శములం గ్రుమ్మరుచుండి రంధు లయి నిశ్శంకం బతిక్రూరక
ర్మములం దుద్యతులైనవారికి నకర్మప్రాప్తి గాకుండునే.

వ. అట్లా క్షత్త్రియు లందఱు భృగుపత్నియొద్దకు వచ్చి మాకు దృష్టిదానంబుఁ బ్రసాదింపవలయు నని వేఁడిన నది యిట్లనియె.

మధ్యాక్కర. ఏను మీదృష్టులు గొన్నదానఁ గా నిక్కుమారుండు
భానుతేజుండు మీచేఁ దనగురులు పరిభూతు లయిన
దానికి నలిగి మీపాపబుద్ధిఁ దగ నిట్లు సేసె
దీని మీ రెఱుఁగరె భార్గవకులము వెలిఁగించు వాని

వ. ఇక్కుమారుండు నూఱుసంవత్సరంబులు నాయూరుగర్భంబుననుండి సకలవేద వేదాంగంబులు నేర్చినవాఁడు మహో తపోనిధి మీకుం గరుణించు నితని బ్రార్థింపుం డనిన నాక్షత్త్రియులు నతిభక్తులై యౌర్వుం బ్రార్థించి తత్ప్రసాదంబున దృష్టులవడసి చనిరంత నౌర్వుండు దనపితృబంధుజను లెల్ల నొక్కట బరలోకగతు లగుటకు దుఃఖించి సకలలోక ప్రళయార్థంబుగా ఘోరతపంబు సేయం దొడంగిన.

చ. అతనితపంబు పెంపునఁ జరాచరసంభృతమైనవిష్టప
త్రితయము భీతిఁ బొందిన భృశం బితృలోకనివాసులైన త
త్పితృవరు లెల్ల వచ్చి కడుఁ బ్రీతి నపాకృతగర్వు నౌర్వు న
ప్రతిమతపోవిభాసిఁ గని పల్కిరి తద్దయు శాంతచిత్తులై.

వ. అయ్యా నీతపోమహత్త్వంబుఁ జూచి లోకంబు లెల్ల భయంపడియెడు లోకానుగ్రహంబుగా నీరోషంబు విడువుము నేమసమరులమై క్షత్త్రియులచేత వధియింపంబడిన వారముగాము ధనలుబ్ధులమయి ధనంబు దాఁచిన వారముగాము ధనమువలసినం గుబేరుండు దానమాకుఁ దెచ్చియిచ్చుం దపోమహత్త్వంబున మాకు నాయువు గడుం బెద్దయైన నిర్వేదించి మనుష్యలోకంబున నుండ నొల్లక యాత్మఘాతంబునం బుణ్యలోకంబులు లేమిం జేసి దానిం బరిహరించి యా క్షత్త్రియులతో వైరం బొనర్చుకొని తన్నిమిత్తంబున దేహంబులు విడిచితిమి భార్గవులకెన్నండు నొరులు పరిభవింప నోపుదురె కావున నీవు దీనికిం గా సర్వజనోపద్రవంబు సేయ వలవ దిది మా కభీష్టం బనిన నౌర్వుండు వారి కిట్లనియె.

నా చేతుల్లో నే తొడిగా దానిపాదాలకి. వాళ్లింట్లో అదొక అబద్ధం, మా యింట్లో నేనొక అబద్ధం ఆడాం. దాని అబద్ధానికి దానికంట్రటుక తెగలేదుగాని, నా పీక పోచిపోయింది అన్నయ్యాకత్తితో.

అయితే! గౌరిని లేవదీసుకొని దూరంగా వుడాయించాలంటే ముందు డబ్బుకావాలి. డబ్బెలా వస్తుంది. అందులోకీ యీ మహా పట్టణంలో! అసంభవం! ఇహ యీ బ్రతుకిలా నీళ్లు కారవలసిందే. అటు గౌరీ పాలిక్కి. ఇటు యెన్నాళ్లయినా బతుకు దొప్పకింద దొప్పే!'

శేఖరం ఆ బీడీ పారేసి మరొకటి వెలిగించి గుప్పు గుప్పున దమ్ములు లాగేడు. అతడి హృదయంలాగే బీడీకొస యెఱ్ఱ యెఱ్ఱగా జ్వలించింది.

* * *

పుట్టినరోజున లక్ష్మి యేం కోరితే అది చెల్లించడం మూర్తి అలవాటు. ఆ వుదయం అడిగితే సినీమాకి వెళ్తానంది. తనకి ఆవేళ ఆఫీసులో మీటింగు. పై అధికార్లు వచ్చేరు. ఇంటికొచ్చేసరికి ఆలస్యం అవుతుంది. శేఖరాన్ని తీసుకెళ్లమన్నాడు. వెళ్లేముందు ఆఫీసుకు రమ్మన్నాడు.

లక్ష్మి! అందాలబరిణ. పదోయేడు అవాళే ప్రవేశించింది. నాజూకుగా వుంటుంది. కోలగా పెద్దకళ్లు. బంగారు చాయ. నవ్వితే బుగ్గలు లోతులు పడతాయి. పట్టుపరికిణీ జాకెట్టు తొడిగించేడు శేఖరం. పనిపిల్ల రెండుజడలు వేసింది. చామపిలకల్లా ముచ్చటగావున్న ఆ జడల చివర కొత్త కాకెనురిబ్బన్లు మెరుస్తున్నాయి.

శేఖరం లక్ష్మిని తీసుకుని ఆరుగంటలు కావస్తూందనగా మూర్తి ఆఫీసుకు వెళ్లేడు. మూర్తి జేబులోంచి నెక్లెసుతీసి కూతురు మెడలో వేసేడు. రవ్వలుపొదిగిన నెక్లెసు తళతళా మెరుస్తూంది.

'శేఖరం! పిల్ల జాగ్రత్త! తల్లీ యేం సినీమా చూస్తావమ్మా?'

'భయంకర ఆకాశ రాకుసులు!'

మూర్తి విరగబడినవ్వి కూతుర్ని ముద్దు పెట్టుకున్నాడు. శేఖరం యెత్తుకుని వీధిలో పడ్డాడు.

బజారువీధి హడావుడిగా వుంది. బళ్ళు, బస్సులు, కార్లుఎలక్ట్రిదీపాలు, మిఠాయి దుకాణాలు—స్వర్గంనుంచి దిగివచ్చినట్లున్న మనుషులు. శేఖరం తలలో తిరిగి ఆలోచనలు బయల్దేరేయి.

ఒక స్త్రీ—ఒక పురుషుడు! పెనేసుకున్న చేతులు. ముసిముసినవ్వులు! మిఠాయి దుకాణాల దగ్గర కార్లు ఆగుతాయి. డ్రైవ

పొట్లాలు లోపలికి అందిస్తాడు. ఆ నాజూకు చేతులు! చిక్కుడుకాయల్లా పొడుగాటి వేళ్ళ చివర మెరిసే యెఱ్ఱటిగోళ్ళు! దొండపండువంటి పెదాలమీద గర్వంగా చిరునవ్వులు " టిష్యూచీరలోంచి లెంపకాయ పెడీమని కొట్టినట్టు తొంగిచూచే యౌవనం!

తన గతి యెలా వుంది! అనేమీ లేవు. పెగా బానిసబతుకు, ఈనాడు మూర్తి తన మీద దయగా వున్నాడు. రేపెలా వుంటాడో స్వతంత్రంగా బతకలేకపోతే చావు మేలు. స్వతంత్రంగా బతకాలంటే మదుపు కావాలి. అదివుంటే గౌరితో దూర దేశం పారిపోవచ్చు.

లక్ష్మి దీపాలు, దుకాణాలు, కార్లు చూస్తూంది. చూడబోయే 'భయంకర ఆకాశ రాక్షసులు' సినీమా వూహించుకు మురిసిపోతూంది. బాబాయి చెయ్యి విస్సాటంగా వూపుతూ నడుస్తూంది. వింత పిచ్చిప్రశ్నలు మధ్యమధ్య వేస్తూంది.

ఎదురుగా వస్తూన్న కారు లైటులో లక్ష్మి మెడలోని రవ్వల నెక్లేసు తళతళ మెరిసింది. మెరుపులా ఆలోచన తట్టింది శేఖరానికి. ఈ నెక్లేసు సుమారు రెండువేలు చేసుంది. దీని నమ్మి, వచ్చిన ధనంతో గౌరిని లేవదీసుకు దూరదేశం పారిపోవచ్చు. ఈ బుద్ధి పుట్టగానే శేఖరం గుండె ఝల్లుమంది. వెంటనే కీనీడల్లోకి తప్పుకున్నాడు. మనసు పరిపరి విధాల పోయింది. ఇటువంటి అవకాశం తరుచురాదు. ఇది తన మంచికే వచ్చింది. దీన్ని జారవిడిస్తే ముందుగతి అధోగతే!

'బాబాయ్! మిఠాయి కొనవా!' లక్ష్మి. శేఖరం పరాకుగా అలాగే అన్నాడు. కాని అతనక్కడలేడు. నెక్లేసు సొమ్ముతో గౌరీతనూ కలకత్తా పారిపోయారు. అక్కడనుంచి వెంటనే బొంబాయి. మారుపేర్లతో ఖుషీగా కాలం గడుపుతున్నారు. శేఖరానికి వంట బాగావచ్చు. మొదట చిన్న టీ దుకాణం పెట్టేడు. అది నానాటికి పెరిగి పెద్ద హోటలైంది. గౌరితో కారు షైర్లు తిరుగుతున్నాడు, ఒకే స్వర్గానందం!

కా రెన్నాళ్ళు! అంతా పేకమేడలా కూలిపోయింది. ఒకనాడు హఠాత్తుగా పోలీసులువచ్చి యిద్దర్నీ బంధించుకు తీసుకుపోయేరు. కోర్టులో హాజరుపెట్టేరు. కాని మూర్తికి సాక్ష్యం యేది. అతను అవాళ సాయంత్రం పిల్లమెడలో నెక్లేసు వేసినట్టుగాని, అసలు పిల్లని తనతో సినీమాకు పంపినట్టుగాని ఋజావు యేదీ! ఎవరక్కడ! లక్ష్మి. తనవేపే చూపిస్తూంది, కోమలమైన-కాదు, తుపాకీలాంటి చూపుడువేలు! 'అదిగో! ఆ బాబాయ్ నా నెక్లేసు లాక్కుని, నన్ను బజార్లో వదిలి పారిపోయేడు!' కోర్టు అట్టుడికిపోతూంది! నల్లకోట్లు, తెల్లపాగాలు, నెక్టైల ప్లీడర్లు హాహాకారం చేస్తున్నారు. 'ముద్దాయి దోషి! రెండు సంవత్సరాలు కఠినశిక్ష!' జడ్జీ వురిమేడు.

శేఖరం వొళ్ళు వొణికింది, అతనికి వెలుగంటేనే భయమేస్తూంది. మరీ కీనీడలోకి తప్పుకున్నాడు. బీటు పోలీసు తనవెంపే చూస్తున్నాడు!

సాక్ష్యం యేకోశానా దొరక్కుండా వుండాలంటే లక్ష్మిని చంపెయ్యాలి! తల తిరుగుతూంది! ఆ వేశంలో లక్ష్మిచేతిని పిడికిట్లో బిగించేడు. ఆ పిల్ల కెవ్వుమంది. లక్ష్మి కళ్ళల్లోకి కోరగా చూసేడు. ఈ నలుసును తుడిచి పెట్టెయ్యాలి. ఎలాగ? కతితో పొడిచి—ఊహుఁ. పీక నులిమి—అమ్మో!... విషంపెట్టి— అంతే.. విషం...విషం.....కాల విషం......

మిఠాయి దుకాణంలో కోకలడ్డూ కొని లక్ష్మికిచ్చేడు. వేరే హల్వా పొట్లాం కొన్నాడు. లక్ష్మి లడ్డూ తింటూ నడుస్తూంది. పక్కనేవున్న షాపులో ఎలకల మందుకొన్నాడు. సందులు గొందులు తిప్పి తిప్పి సముద్రపొడ్డు చేరుకున్నాడు.

'బాబాయీ! కాళ్ళు పీకెడుతున్నాయి, యెత్తుకో...' లక్ష్మి. అతడు వినిపించుకోలేదు.

'బాబాయీ! భయంకర ఆకాశ రాక్షసు లెక్కడ?...'

అతడు వినిపించుకోలేదు. ఆ పిల్లని యెత్తుకుని సముద్రపొడ్డంట పడి పోతున్నాడు. ఇళ్ళుదాటి, గుడిశలు దాటి, కొబ్బరి తోట, యెఱ్ఱమట్టి దిబ్బలుదాటి కోరగా నడిపో

# ★ వెలుగు ★

తున్నాడు. అక్కడ నరసంచారం లేదు. కళ్లుండీ నోరులేని ముక్కలు, అర్థం లేకుండా శబ్దించే సముద్రపు టలలు, హోరుని యిచ్చే యీదురుగాలి తప్ప మరేం లేదు. అతడి భుజంమీద ఆ పసిగుడ్డు నిశ్చింతగా నిద్రపోతూంది.

శేఖరం యిసకదిబ్బలమధ్య చేరేడు. అక్కడ బాగుంది. శవాన్ని చక్కగా పూడ్చిపెట్టవచ్చు. గాలి 'జాం ఝాం' మంటూంది. మసక చీకటిగావుంది. దూరంగా తోటలో కొబ్బరిచెట్లు చింపిరి దయ్యాల్లా తలలూపుతున్నాయి. లక్ష్మిని నెమ్మదిగా ఇసకలో పడుకోపెట్టేడు. హోల్డాల్ పొట్లంవిప్పి ముందుకలిపేడు. లక్ష్మిని లేపబోయేడు. చేతులు వణికేయి. శరీరము ముచ్చెమటలు పోసింది.

ఇంతలో చీకటిలో యేదో కదులుతూంది. అది దగ్గరగా వచ్చింది. కుక్క! మూతి కదిలిస్తూ తోకాడిస్తూంది. యాదాలాపంగా సగం హోల్డాల్ దానిముందు విసిరేడు. అది గబాల్న యెగిరి అందుకుంది. కొంతసేపు యిటూ అటూ తిరిగింది. అక్కడే పడుకుంది.

దూరంగావున్న తీర రక్షణశాఖవాళ్లు 'సెర్చిలైటు' వేసి తీరపరిసరాల్ని పరీక్షిస్తున్నారు. అదిపవు సముజ్వలమైన కాంతి కిరణం అసమయానికి సరిగ్గా శేఖరం వున్నవేంపే తిరిగి అక్కడ కొన్నిక్షణాలు నిలకడగా వుంది.

కుక్క వో తిరిగి పడుకుంది. శేఖరం పారదన్ని కూడదీసి మూలుగుతూ గిలగిల తన్నుకుంటూంది. అది కుక్క కాదు లక్ష్మి. ఆ పసిపిల్ల పిడికిళ్లు బిగించి వెల్లకిలా పడివుంది. మొహనరాలుబ్బి, దవడలు దగ్గర పడిపోయేయి. ఊపిరి గుప్పుపడి యెగశ్వాస వస్తూంది. చూస్తూండగా ఆ బొందిలోంచి హంస యెగిరిపోయింది. ఆమె ఆత్మ తన ముందు ప్రత్యక్షమై 'బాబాయ్! నువ్వే భయంకర ఆకోశ రాక్షసుడివి' అంటూంది. తనగుండెలు తనచెవుల్లో కొకలిపోట్లు వినిపిస్తున్నాయి.

పొట్లం సముద్రంలో విసిరి, దెయ్యి కరుచుకున్న లక్ష్మిని లేపేడు.

'పదమ్మా! సినిమా వేళయి పోయింది.'

'భయంకర ఆకోశ రాక్షసులా...?'

'కాదు–వెలుగు' ★

# నక్షత్రఫలితాలు

[17-6-59 మొదలు 23 6-59 వరకు]

### గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| కే | | | ర బు |
| | తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. | | శు కు |
| | | | |
| శ | గు | | రా |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధిక్షీర మధురపదార్థయుక్త భోజనము రజిత పాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్త్రములుకొనుట, మొదలగు యోగములు కలుగుతవి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవ పదార్థముల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. వారాంతమున అధిక ఆందోళన.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి, కృషి మూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు కొత్త తరగతులలో ప్రవేశిస్తారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. స్త్రీలతోనూ, ఆప్తులతోనూ సరంగు, వినోదము. 20, 21 కుటుంబ కలహము.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీకు రాబడి తక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరక కలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడమేకాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించడము మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. 17, 18 పితృవర్గ సహాయము, కార్యలాభము. ప్రయాణము. 20, 21 రాజకీయ వాదులకు ఆందోళన, అధిక ఖర్చులు. 22 అనారోగ్యము.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము మీకు మొదట్లో నిరాశగా వున్నా, మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు బదిలీ అయ్యే సూచనలు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగము లున్నా, మిత్ర సహాయము, కార్యసిద్ధి,

బి. నరసింగరావు

విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తు సంపాదనవంటి శుభయోగాలు కూడా వుంటాయి.

### * మృగశిర [వే, వో, కా, కి] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధిబలము ఉపయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధి వుండదు. చేతికి వచ్చే డబ్బు అవసరాలకు సరిపోక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వుందని తెలిసి మదనపడతారు. అయిననూ దైవానుగ్రహముచే అన్నీ సరిపడతాయనే మనోధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన, నిలకడలేని స్థితి, ప్రయాణము. 17, 18 నష్టద్రవ్య లాభము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతా దర్శనము. వింతలను చూచుట. 22న ఆరోగ్య చింత.

### * ఆరుద్ర [కూ, ఘ, జ, ఛ] *

ఈ వారము అనుకున్నట్లుగా డబ్బు చేతికిరాకపోవుటచేతను, అధిక ఖర్చులు చేతను అశాంతి, కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు కొంతవరకూ అనుకూలిస్తవి. ఉద్యోగులకు అధికారుల తొందరలు. వర్తకులకు అశాంతి. భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారముల పరిష్కారములో దుష్ట స్త్రీలతో వివాదము. 20, 21 ధనలాభము. 22 కార్యభారము, త్రిప్పట, వివాదములు, భార్యకు ఆరోగ్యభంగము. 23న కార్యసిద్ధి.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

తలపెట్టినపనులు మీదవేసుకొని కార్యసాధన అవనప్పటికీ నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు ఫలప్రాప్తి పొందుతారు. సోదర సహాయము కొంత అనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్తు అధికారుల చురుకుమాటలచే మనోవ్యథ కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి. ప్రమాదమువల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువులు వ్యాపారస్తులకు, గనుల యజమానులకు లాభము. 19 ప్రమాద సూచన. 20, 21, 22 కార్యభారము, ఆటంకములు. 23 సోదర సహాయము, కార్యలాభము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈవారము మీకు యోగదాయకము. బంధు సహాయము, అధికారుల సహాయము కలుగుటచేతను ఆటంకములను గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. కవులునూతనరచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులు ఉత్సాహముగా కొత్త క్లాసులలో చేరుతారు. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము.

### * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈవారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్నడబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల బాగుకోరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన వుద్యోగస్తులకు న్యాయ

#  నక్షత్రఫలితాలు 

...భాగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈవారము మీకు యోగదాయకము ధన యోగం వుంటుంది. సంగీతసభలు, కవితా గోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభ కార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈవారము యోగదాయకముగావుంటుంది అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభ పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబ కలహముచే ఆందోళనకలుగుతుంది. వారమంతా కుటుంబములో మిత్రులతో విందు వినోదము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈవారము రాబడి తక్కువ కార్యభారం ఎక్కువ గృహావసరములు తీరక స్పర్ధలు వస్తవి. అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడము, రవికి శాంతి చేయడం మంచిది. వుద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గము నుండి సహాయము, కార్యలాభము కలుగుతవి.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల ఆందోళన తీరుతుంది. ఇంట్లో వున్న వారి అనారోగ్యమువల్ల అశాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా వుద్రేకముతో వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూపవస్తుసంపాదన కలుగుతవి. 20 21 అధిక ఖర్చులు, మనోవ్యథ.

### *చిత్ర [పే, పో, రా, రి]*

ఈవారము ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువలన మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా వున్నా నష్టద్రవ్య లాభము పొందుతారు. 19 న అధిక ఖర్చులు.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము అనుకూలతకన్నా ప్రతికూలత యెక్కువ ఇచ్చిపుచ్చుకునేపట్లవివాదములు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా, అమితఖర్చుల వల్ల సంతోషముండదు. భార్యకుఅనారోగ్యం కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతరజాతులవల్ల గౌరవము కలుగుతుంది. 19 న బంధువుల రాక, అధికఖర్చులు.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈవారము ఎంతప్రయత్నించినా యత్నకార్యాలకి ఆటంకము కలుగుతూనే వుంటుంది. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజవ్యాపారస్తులకు భూస్వాములకు కష్టముతోగూడిన లాభము. పోలీసుశాఖ వుద్యోగస్తులకు మేలుకాలము. 19 న ప్రమాదసూచన.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈవారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధన

## —ఈవారము ధరలు:—

నూలు, వస్త్రములు:-తగ్గుదలలో వుండును.
నూనెదినుసులు:-మార్పు లేదు.
ఆహారధాన్యములు:- సమస్థాయిలో వుంటాయి.
బెల్లము, పంచదార:- చింతపండు:- మార్పు లేదు.
పప్పుదినుసులు :- మందముగావుండును.
వెండి, బంగారము - స్వల్ప తేడాలో వుండును. సస్యానుకూలము గావర్షించును

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకుమృగశిరానక్షత్రమును, హ్రృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకొనునది.

లాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమసమాచారము తెలుస్తుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము. గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు జరుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచువర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 19 న అధిక ఖర్చులు.

## జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

ఈవారము మీకు శుభయోగము. ఆశించినడబ్బు చేతికి వస్తుంది ఇంట్లో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ ప్రభుత్వ సన్మానము. వైద్య జ్యోతిషశాస్త్రములవంటి ప్రసంగాలు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగావున్నా కొంతఆందోళనకూడా వుంటుంది. పిల్లల అభివృద్ధికి కొన్నియేర్పాట్లు చేస్తారు.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీరుతలపెట్టిన కార్యములలో జయముపొందుతారు. వెండిపాత్రలలో మృష్టాన్నభోజనము బంధుమిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి బియ్యము ద్రవపదార్థజనితవస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు నటీనటులకు మేలు కాలము. 19 న అధిక ఖర్చులు.

## * పూర్వాషాఢ [బూ, ధ, ఫా, ఢా] *

ఈవారము మీకు రోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. ఇష్టవస్తులాభము. పరోపకారంవల్ల కీర్తికలుగుతుంది. విద్యార్థులకు చాలాచురుకుగా చదువు సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమితలాభము పొందుతారు. వాహనయోగములు కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 22 న కుటుంబకలహము.

## * ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] *

ఈవారము కార్యభారము ఎక్కువ. వింతమాటలువినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్థులకు స్వల్పఅనుకూలత. విద్యార్థులకు చదువు సరిగాసాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 19 న అనారోగ్యము.

## * శ్రవణము [జూ, జే, జో, ఖా] *

ఈవారము తలపెట్టిన పనులు నెరవేరవు. ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము ఎక్కువ. ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్థులకు వన పర్వతప్రాంతములకు బదిలీ అయ్యే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించిబడుతారు. వారమంతా చికాకుగావున్నా వారాంతములో మిత్రసహాయము, విదేశీయుల పరిచయము. కార్యసిద్ధి జరుగును.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము ధనాభావము ఎక్కువ ఎవరి సహాయంవల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయిననూ దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్థులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచి రోజులు గావు. వారమంతా ఆందోళనవున్నా సాధుసజ్జన సాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము వింతలను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగుతవి.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తవి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు, భార్య ఆరోగ్యము సరిగా యుండదు. ఇచ్చి పుచ్చుకోనే పట్ల వివాదములు ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ వారాంతమున లాభము. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈవారము ఎన్ని అవాంతరములు వచ్చినాపట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన ధనం సమయానికి అందక అప్పుచేస్తారు. ఆత్మీయులవల్ల నిందలపాలవుతారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు రంగులు లోహపు సామానుల, వ్యాపారస్థులకు కష్టముతోకూడిన లాభము. 19 న ప్రమాదభయం.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈవారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోను అధికారుల సహాయముతోనూ ఆటంకములు గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిశ్శాస్త్రప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము. కవులకు, శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటీనటులకు యోగకాలము. 17, 18 తేదీలలో ధనలాభము. కార్యసిద్ధి.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతనకార్యములు ప్రారంభిస్తారు. కోర్టుదావాలలో కొంత అనుకూలత వుంటుంది. పండితగోష్ఠి జరిపి విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనతో కూడి వుంటుంది. ధనలాభము. పుత్రులఅభివృద్ధి, కార్యసిద్ధి 19 న అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు. పండితులకు ఉపాధ్యాయులకు మేలుకాలము. ★



# వనితా లోకం





## తొలి పలుకులు

వి. ప్రేమలత

చక్కగా మాట్లాడ గలగటమనేది ఒక కళ. ఈ కళ బాల్యంనుంచే మానవులకు అలవడుతుంది. సృష్టిలో మరే ఏ ఇతర జంతువులూ లేని ఈ అపూర్వ వరాన్ని, భగవంతుడు మనకు ప్రసాదించాడు. అమోఘమైన ఈ కళకు రూపురేఖలు దిద్దేవాళ్ళు చిన్నారి పొన్నారి పాపాయిలు.

చిట్టి పాపాయిల తీయని కబుర్లు వింటూంటే మనస్సు ఏదో అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోతుంది. ఎక్కడ చూచినా భయం, భీతి, దరిద్రం, చీకటి నిండుకున్న – ఈ ప్రపంచంలో తీయని కబుర్లతో హృదయాల నలరించే ఆ పాపలే లేకపోతే బ్రతుకెంత దుర్భర మవుతుందో, అంధకార బంధురం దుఃఖపూరితం అవుతుందో ఊహించలేం.

పసిపాప ఎప్పటినుంచి చిలుక పలుకులాంటి తీయనిమాటలు పలుకుతుంది? ఈ విషయంలో తల్లి సహకారం పాపకి ఎంతవరకూ అవసరం?

పాపాయి పుట్టి ఆరువారాలయింతర్వాత నుంచీ తన గొంతు కొట్టం వైభాగంలో వున్న స్వరతంత్రుల్ని మాటలకోసం ఉపయోగించటం ప్రారంభిస్తుంది. ఇలాంటప్పుడు పాపాయి కలిగించే శబ్దాలసాయి గుడుగుడు శబ్దం నుంచి – 'కవ్వ్' నీళ్ళలేస్తూ— 'గ్గ్' మని గట్టిగా విచ్చేటంతవరకూ వుంటుంది. ఇదంతా పాప తాను ముందు చేయబోయే 'మాట్లాడుట' అనే అలవాటుకి తరిఫీదన్నమాట. ముందుముందు స్వతంత్రంగా నిలుచుండడానికి, నడవడానికి–పాపకాళ్ళు చేతుల్ని ఎలా కదలించుతూ–చేప పిల్లలా పక్కమీద తిరుగుతుందో–అలాగే మాట్లాడటానికీకూడా పాప మొదటినుంచీ ట్రయినింగ్ తీసుకొంటుంది.

ఒక ఏడాది గడిచేసరికి—తన చుట్టూతా వినవచ్చే ధ్వనుల్ని అనుకరించడానికి ప్రయత్నిస్తుంది. ఆ ధ్వనుల్ని మనలాగే మాటల రూపంలో అనుకరించడానికి – మాట్లాడే భాషను తయారుచేసికోటానికి–తన చిన్నారి లేత మెదడును ఉపయోగించుకొంటుంది. సరిగ్గా ఏ వయస్సులో పాపాయి మాట్లాడటం ప్రారంభిస్తుందో చెప్పడానికి వివిధాభిప్రాయాలున్నాయి. కొన్నిసార్లు కొందరు పిల్లలు మూడేళ్ళు నిండినా మూగగానే ఉండిపోతారు. మామూలుగా శరీరారోగ్యం బాగుండి –, శరీరాభివృద్ధిలో ఏ లోపమూ లేకుండావుంటే–చుట్టూతా వినవచ్చే శబ్దాల్ని, వినికిడి జ్ఞానం, గ్రహింపూ వుంటే, త్వరగా మాట్లాడలేకపోయినా గాబరాపడనక్కరలేదు. రెండువేళ్ళు నిండేసరికి–పాపాయి మాటాడే చిన్నారి పలుకుల్లో తన చిన్న ఉద్దేశాలను చిత్రించేస్తూంటుంది. తానుచేస్తూన్న పనులకి మాటల్ని–అంటూన్న పలుకులకి చేతల్ని జోడిస్తూంటుంది. మా అన్నయ్య కొడుకు రెండేళ్ళవాడున్నాడు. వాడంటాడు: 'అత్తా.' అమ్మ కొట్టి ఇక్క... అని మిగతా మాటలురాక తనబుగ్గమీద చేయిపెట్టి కొట్టి మరీ చూపిస్తూంటాడు. ఇంకా అంటాడుగదా 'నానమ్మ: కాఫీ, ఇక్క' అంటూ క్రింద కూర్చుని చూపిస్తూంటాడు. ఇలా మాటల్లో వ్యక్తంచేయలేని తమ ఉద్దేశాలను చేతల ద్వారా చూపెడుతుంటారు.

శబ్దాన్ని పుట్టించే అవయవాలు అవగా: నోరు, పెదవులు, నాలుక, స్వరపేటిక, ఊపిరితిత్తులు – హృదయ కండరములూను. ఇవన్నీ మునుపటికన్నా చురుగ్గా పనిచేయ ప్రారంభిస్తాయి. సాధారణ పరిస్థితుల్లో పెరిగే పాపాయి, ఆరోగ్యంగా, సంతోష వాతావరణంలో వున్నప్పుడు – ఈ పెరుగుదల క్రమేణా వృద్ధవుతూ, తనకు సంబంధించిన విషయాల్ని గురించి ఎక్కువగా మాటల రూపంలో, వెలువరించే వీలవుతుంది. పాప ప్రశ్నలడిగే వీలు వచ్చేసరికి–తనచుట్టూతా వున్న విచిత్రప్రపంచంగూర్చి – అందులో వుండే మనుష్యులను గూర్చి – వస్తువులనుగూర్చి ఆ చిన్ని బుర్రలో నుండి ఉత్పన్నమయ్యే ప్రశ్న పరంపరలకు తల్లి దండ్రులు ఆశ్చర్యచకితులవుతుంటారు.

ఉదా: "[illegible] ఎలాగొచ్చిందమ్మా" మనఇంటి మెట్టుమీద కాకి ఎవ్వరందుకొదమే. అమ్మా: నాన్న నీకేమవుతాడమ్మా..

మా అన్నయ్య కూతురు, గుండె మీద చెయ్యివేసికొని 'ఇక్కడటిక్ టిక్'మంటుంది. అదేటత్తా' అని అడుగుతుంటుంది.

పిల్లలకి మంచి వాక్శక్తి అలవడడానికి దేహారోగ్యమూ సంతోష వాతావరణం ప్రధానపాత్రలు వహిస్తాయి. మూడేళ్ళు నిండినా పాప ఇంకా మాట్లాడలేకయున్నా స్వచ్ఛంగా మాట్లాడలేకపోయినా కొన్ని కొన్ని విధానాలు అవలంబించవచ్చు. పసితనంలో ఏదైనా జబ్బుపడటంవల్లా, లేక ఏదైనా దెబ్బతగలటంవల్లనూ మెదడులోని లేక నాడీమండలంలోని ఇతర భాగముల్లో ఏదైనా లోపం ఏర్పడియుండవచ్చును. లేక పాపకి కొద్దిగా చెవుడున్నావుండి అలాంటి ఫలితాన్నిస్తుంది. ఇటువంటి పరిస్థితుల్లో శాస్త్రజ్ఞులైన వైద్యుల సలహాలతో ఆలోపాల్ని పూరించడం మంచిది. కొన్నిసార్లు పాపాయి మాట్లాడుతూ—మాట్లాడుతూ సడన్‌గా మాట్లాడటం ఆపేస్తుంది. అప్పుడు తనకు కావలసిన వస్తువులకోసం— ఇతరవాటికోసమూ సంజ్ఞలు చేయటం మొదలు పెడుతుంది. ఇట్లా చేయటం పొరుగింటివాళ్ళవల్ల కావచ్చు! తాను కష్టపడి మాట్లాడనక్కర లేకుండా అన్ని

కోరికలూ ఇలా తేలిగ్గా నెరవేర్చుకోవచ్చని పాప తలంచి యుండవచ్చు. అలాంటప్పుడు చేయవలసింది ఒకటే: పాప నోరువిప్పి మాట్లాడేవరకూ ఆ సంజ్ఞలవీ అర్థం కానట్లు నటించడమే!

పాపాయి పెరిగే ఇంటి వాతావరణం కూడా ఆమె వాక్శక్తిపై అధిక ప్రభావం చూపెడుతుంది. ఇంట్లో దినమంతా తల్లితోనే గడిపే ఒకేఒక పాప వుండి—ఆ తల్లియినా ఎక్కువగా పాపతో గడపక ఇంటి పనుల్లో—ఇతర విషయాల్లో మునిగివుంటే— అలాంటి వాతావరణంలో పెరిగినపాప సాధారణంగా మూగత్వాన్ని ప్రేమిస్తుంది.

కారణం: ఆమె వాక్శక్తిని అభివృద్ధి చేసుకొనే అవకాశాలు పాపకి లోపించాయి కాబట్టి. చాలమంది తల్లులు వాళ్ళపాపలతో ఎన్నో తీయనికబుర్లు చెప్పుతుంటారు. లాలిపాటలు పాడుతుంటారు. సమయం దొరికినప్పుడల్లా పాపాయిలభాషలో తీయ తీయని కథలూ, కబుర్లూ చెబుతూ తాము మురుస్తూ పాపల్ని మురిపింపచేస్తారు. పాపకు మంచి వాక్శక్తి అలవడడానికి ఇది నిజంగా ఎంతో ఉపయోగకరమైందీ—ఆనందకరమైన వాతావరణం కూడా. దీనికి వ్యతిరేకంగా గొల్లున గోలగావుండే ఇంట్లో ఇరవై నాలుగు గంటలూ రేడియో 'గోయ్' మంటూ—సందడిగావచ్చే ఇరుగూ పొరుగూ వారితోనూ, గట్టిగా అరుస్తూ గావుకేక లేసేవారితోను—ఇల్లంతా నిండి వున్నప్పుడు పాపాయికి ఒంటరిగా అమ్మతో తీయని కబుర్లు చెప్పుకొనేందుకూ—ప్రశాంతంగా తన మెదడును ఉపయోగించి చుట్టూ రావచ్చేధ్వనుల్ని గ్రహించి అనుకరించే తరుణంలేక మూగనోము పడుతుంది.

పిల్లలు మాట్లాడే తీరు విషయంలో ఒక విషయం తల్లులు జ్ఞప్తియందుంచుకోవాలి. అది, గారాబంగా మాట్లాడే భాష (Baby talk) పాప బాల్యదశదగ్గర్నుంచీ స్ఫుటంగా స్పష్టమైన భాషలో మాట్లాడేలా చూడడం మంచిది. పిల్లలకి పెద్దవాళ్లు పెట్టే ముద్దు పేర్లు (Pet names) తప్పించి మిగతాదంతా స్పష్టమైనభాషలో వాళ్లతో మాట్లాడటం. మాట్లాడించటం చేయాలి వయస్సులో పెరుగుతున్నా పాప ఇంకా మరి పసిపాపలాగా గారాబు మాటలు పలుకుతుంటే చూసటానికి వింటానికి బాగుండదు కొందరు తల్లులు పిల్లలలా మాట్లాడుతుంటే మురిసిపోతుంటారు గాని వాళ్ల భాషని సరిదిద్దడానికి ప్రయత్నించరు మాకు తెలిసినావిడ కొడుకు అలానే చిన్నప్పుడు వాళ్ళమ్మ నేర్పె గారాబు మాటల్ని ముద్దుగా పెదాలు వెనక్కి విరిచి వరీ చెప్పేవాడు. అప్పుడు బాగానే వుండేది. ఒక ఇప్పుడు ఆ కుర్రాడికి పద్నెళ్లు వచ్చినా ఇంకా అలానే పెదాలు వెనక్కి విరిచి గారాబంగా మాట్లాడుతాడు. ముద్దేసుకురాదు సరిగదా కొట్ట బుద్ధవుతుంది. ఇంకా ఇలా గారాబంగా మాట్లాడటానికి కారణాలు ఇంట్లో తన కన్నా చిన్న పిల్లలు వుండటంవల్లా—తన కన్న చెల్లాయిని, తమ్ముడ్ని బాగా చూస్తారని తలంచడంచే కలిగిన ద్వేషంవల్లనూ కావచ్చు. ఇంకా ఇలా గారాబంగా మాట్లాడటమనేది సాధారణంగా ఎక్కువ ముద్దుగా అపురూపంగా పెంచే పిల్లలకు అలవడుతుంటుంది. ఎదుగుతున్న పాపని స్వేచ్ఛగా ఎదగనీయక వో రబ్బరు బొమ్మ క్రింద చూసుకుంటూ ప్రతీ విషయానికి అమ్మమీద ఆధారపడేట్టు పెంచుతుంటారు కొందరు తల్లులు. మాకు తెలిసిన వాళ్ళింట్లో ఒక అమ్మాయివుంది. ఒక్కతేకూతురు. ఆ తల్లికి ఆపిల్ల అపురూపం. అది సహజమే అనుకోండి. కాని ఆ పిల్లకి 12 ఏళ్ళు నిండినా ఆ తల్లి పిల్లనింకా పాలు తాగుతూన్న పసిపాపలానే చూసుకుంటుంది. ఫలితంగా అన్నేళ్ళు వచ్చినా ఇంకా ఆ పిల్ల రాత్రులు చంటిపిల్లలా పక్కంతా తడిపేసుంటుంది. అందువల్ల తల్లులు పిల్లల పెంపకం విషయంలో అతి జాగ్రత్తగా వ్యవహరించాలి. సరిసరిగా మాట్లాడటం ముద్దుగా మాట్లాడడం 4-7 సం॥ల మధ్య పిల్లలకు వస్తుంటుంది. సరిగా మాట్లాడేవాళ్ళని అనుకరించటం మాట్లాడాలని సరిగా పలకటం చేస్తుంటారు. ఇలాంటప్పుడు మంచిపద్ధతి అలా మాటాడేటప్పుడల్లా సరిగ్గా స్వచ్ఛంగా మాట్లాడేవరకు శిక్షించయినా గట్టిగా ప్రయత్నించడం.

ఏమయినప్పటికి చక్కగా స్పష్టంగా మాట్లాడటమనేది ఒక కళ. దీన్ని తీర్చి దిద్దడానికి తగిన ఉపాధ్యాయిని తల్లే. ఆ తల్లి శిక్షణలోనే పాపాయి తొలిపలుకులు తీయని మాధుర్యాన్ని పెదజిమ్ముతాయి. ఆ కబుర్లు ఎంత బాగుంటాయని. మీ ఇంటిలో చిట్టిచిట్టిపాప లున్నారా! ఉంటే తెల్లారేవాలుగ్గంటలప్పుడు మెలకువపడి వినండి మనందరికన్న ముందరగా లేచిన అందాల పాపాయి వాళ్ళమ్మ పక్కలో పడుకొని కేరింతాలు కొడుతూ ఎంత మధురంగా కబుర్లు చెబుతూవుంటుందని!!! ★

# ఇప్పుడు నేను హాయిగా ఉన్నాను!

## ఈనో కడుపులోని అస్వస్థతకు త్వరగా ఉపశమనము కలిగించును!






వేరకడుపున ఈనో కొంచెము పెద్ద మోతాదు త్రాగుతే సౌమ్యమైన విరేచనకారిగా పనిచేయును

మీరు అలసటముగా, చికాకుగా, మరియు ఏమీ తోచకుండా ఉన్నా, లేక మితిమీరి తినటంవలన మీ కడుపులో అస్వస్థతగా ఉన్నా, ఒక గ్లాసెడు మెరయుచు పొంగే ఈనో త్రాగండి! అది త్వరగా గుణము కలిగించుట ప్రారంభించి, కడుపులోని బాధాకరమైన ఆమ్లమును పోగొట్టును, ఒంట్లో వేడిని తగ్గించును మరియు శక్తి ఉత్సాహమును తిరిగి యిచ్చును!

ఈనో త్రాగుటకు బాగుంటుంది మరియు సౌమ్యముగా, ఎంతో సామర్థ్యముగా ఆమ్లమును విరుస్తుంది. దానిని కుటుంబములో పిన్నా పెద్దా అందరూ వాడవచ్చును. అధికమును కడుపులోని అస్వస్థతను, అజీర్ణమును వెంటనే నయముచేయుటలో ఈనో సాటిలేనిది!

## ఈనో 'ఫ్రూట్ సాల్ట్' నవోత్సాహమును కలిగించును!

'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు

గ్రూప్ లేబొరెటరీస్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్

# సన్నబడాలంటే?!

"పెద్దన్నతో ఇంకెప్పుడూ ఎక్కడికీ పోను బాబూ!" అన్నాడు మా తమ్ముడు, అంటే మా పిన్ని కొడుకు.

"అదేంరా?" అని ప్రశ్నించింది అక్క.

"కాళ్లు నొప్పులు పట్టుతున్నాయి. తిప్పి తిప్పి చంపేడు. పోతానంటే పోనిచ్చేడు కాదు; సరికదా దోవలో కనీసం మంచి నీళ్ళయినా తాగనిచ్చేడు కాదు. ఏమనడిగితే "ఇంటికెళ్ళిక తాగ"మన్నాడు. అడుగుతీసి అడుగుపెట్టడానికి ఆయాసంతో నేపడ్డ యాతన ఆ పరమేశ్వరుడికే తెలియాలి! పగవాళ్ళకేనా వద్దుబాబూ అలాంటియాతన" అని చిలవలుపలవలుగా చెప్పుకుపోతున్నాడు.

ఆసమయంలో ఇంట్లోవాళ్ళందరికీ తమ్ముడిమీద జాలి, అన్నయ్యమీద కోపం ఒక్కసారే జమిలిగా ముంచెత్తుకొచ్చాయి.

ఆ మరుచటిరోజున మళ్ళీ పెద్దన్నయ్యా, చిన్నన్నయ్యా వీధిలోకెళ్ళబోతూవుండగా తమ్ముడు గబగబా వాళ్ళదగ్గరకొచ్చేడు; ఆ రోజు తప్పకుండా పెద్దన్నయ్యతో తీసికెళ్ళమని మారాముగా రాములతో ఒకటే గోలగా అన్నయ్యని అడుగుతున్నాడు.

తమ్ముని గాని ఒద్దని గాని అన్నయ్య చెప్పేలోగానే ఇంటిల్లిపాదీ ఏకమై "ఎందుకురా మళ్లా వాడితో వెళతానంటావూ? నిన్న వెళ్ళినందుకు అనుభవించింది చాలదూ" అని గదమాయిస్తూ ఎన్నో విధాలుగా తమ్ముడికి నచ్చచెప్పేరు వెళ్ళొద్దని. కాని ఎవరెన్ని విధాల నచ్చచెప్పినా వినక అన్నయ్యతో వెళ్లక మాననని పట్టుపట్టాడు తమ్ముడు.

హఠాత్తుగా మా తమ్ముడిలో కలిగిన ఆ వింతపరివర్తనకి కారణమేమిటాఅని ఎంతగా ఆలోచించినా ఏదీ స్ఫురించకపోయేసరికి ఇంటోవాళ్ళందరు ఆశ్చర్యపోయేరు.

ఇంతకూ జరిగిందేమిటంటే ఆ ముందురోజే మా పిన్నీ, పిన్నికొడుకు (తమ్ముడు) పూరినుంచివచ్చేరు. వాళ్లు దారిలో మజిలీలు చేసుకుంటూ రావడంవల్ల మా తమ్ముడి బట్టలన్నీ మాసిపోయిన కారణాన్ని చిన్నన్నయ్య బట్టలు ఒక జత అడిగి తీసుకున్నాడు. కాని తమ్ముడికి ఆ బట్టలు సరిపోక నానా యాతనా పడి ఎలాగో సరిపెట్టుకున్నాడు. అప్పటి వాడి అవస్థ చూసి అందరం నవ్వుకున్నాము కూడా. ఎందుకంటే—

నిజానికి వాడు మా అందరికంటె చిన్నవాడైనా చూడానికి మా పెద్దన్నయ్యలాగా కనుపిస్తాడు. వాడు అంత చిన్నవయసులోనే అంత లావుగా వున్నాడంటె ఈ సందర్భంలో వాణ్ణి గురించి కొంచం చెప్పక తప్పదు!

మా తమ్ముడు ఒక షాపులో పనిచేస్తున్నాడు. అదైనా ఇంటికిబారెడుదూరంలో వుంది. అందువల్ల ఇంటినుంచి షాపుకి షాపునుంచి ఇంటికి నడవడానికి అట్టే కష్టం లేదు సరికదా పొద్దుగూకులూ షాపులో కూర్చోడంవల్ల రోజు మొత్తాన్ని అడుగు తీసి అడుగుపెట్టే అవసరంలేదు. అథవా షాపుపనిమీద ఎక్కడికైనా వెళ్ళవలసి వసే రిక్షాలో వెళ్ళిరావడం. పైగా ఆరారా కాఫీ టిఫన్లు. ఈరకం దినచర్యలవల్ల వాడికి ఆ లేతవయసులోనే పొట్ట పెరిగిపోయి, ఒళ్ళు ఊబదేరిపోయింది. కనుకనే చిన్నన్నయ్య బట్టలు వాడికి సరిపోలేదు.

అయితే నిన్నటిరోజున అన్నయ్యతో వెళ్ళినప్పుడు అన్నయ్య నడిపించినమూలంగా వాడి పొట్ట కొంత కరిగిపోయి చిన్నన్నయ్య బట్టలు ఇప్పుడు కట్టుకోడానికి సరిపోయాయి. అందుకని అన్నయ్యతో కలిసివెళ్ళడానికి తమ్ముడు మనస్ఫూర్తిగా సమ్మతించి

## జి. మీనాక్షి

అంతగా పట్టుపట్టేడు. ఈ కీలకం అన్నయ్య చెప్పితేనే గాని మా కెవరికీ తెలిసిందికాగు.

అంతతో 'లావెక్కినవాళ్లు నడవడంవల్ల సన్నబడతారా' అని మా అందరికీ సందేహాం కలిగింది. ఆ సందేహమే పైకి వ్యక్తపరుస్తూ పిన్ని అడిగేసరికి అన్నయ్య ఇలా చెప్పేడు:

లావుగా వున్నవాళ్ళు ప్రతిరోజూ ఆపాటీపాటి దూరం నడవడంవల్ల పొట్ట కరిగి, ఒంట్లో ఊబ కరిగి సన్నబడడానికి వీలుంటుంది. ఆడవాళ్లయితే ఇంట్లోవున్న పనిపాట్లను బద్ధకపడకుండా చేసుకోడంలో కూచుని, లేచి, ఇటూ అటూ కుసలుతున్నందు వల్ల సన్నబడవచ్చును. అంతే కాకుండా, విశేషంగా శ్రమిస్తేతప్ప పగటిపూట ఎంత మాత్రం నిద్రపోకూడదు. కొందరు నిద్రపోకపోయినా పక్కమీద పడుక్కుని, ఇటూ అటూ దొర్లుతూ గంటలతరబడి బాతాఖానీ కొడ్తూవుంటారు. ఇంకొందరు మంచంమీద కూర్చుని మాట్లాడుతూ గంటల తరబడి వుండడమే కాకుండా కనీసం మంచినీళ్ళకయినా కదలకుండా ఎవరినో ఒకరిని తెచ్చిఇమ్మని పురమాయిస్తూవుంటారు. ఇలాంటి కారణాల వల్లనే మనుషులు ఊబదేరి లావవుతారు. కనుక ఆ విషయంలో శ్రద్ధవహించడం మంచిది.

చాలామందికి చిరుతిళ్ళుతినడం అలవాటు. ఈరకం మనుషులకి ఎప్పుడూ దవడాడిస్తూ ఏదో ఒకటి తింటూవుండడమే ధ్యాస. వీరిలో కొంత కలిగినవారే అయితే ఇక చెప్పే అక్కర్లేదు. పక్కలోనో మంచంమీదనో కూర్చుని కదలకుండా ఆరారా కాఫీ, ఓవల్టిన్, గ్లాస్గో, గ్లూకోజ్ బోర్న్‌వీటా, ఫ్రూట్ జూస్, బ్రెడ్, కేకులు అంటూ ఏదోఒకటి గాణావేస్తూండడమే పని.

ఇలా ఉదయం లేచింది మొదలు రాత్రి పడుక్కునే లోపుగా భోజనం అంతంత మాత్రంగానూ, ఆరారా చిరుతిళ్లు ఎక్కువగానూ తింటూ, నామమాత్రంగా తప్పితే కదలకుండా, కూర్చునో పడుకునో బాతాఖానీ కొట్టడం, నిద్రపోవడంవల్ల శరీరం ఊబదేరి, పొట్ట విపరీతంగా పెరిగి మనిషి లావెక్కడం జరుగుతుంది.

పోతే కొంతమంది ఎంతతిన్నా నలికివరంలా సన్నగా వుంటారు; కొందరు ఎక్కువగా తినకపోయినా లావెక్కి పర్వతాకారం దాలుస్తారు. దానికి కారణం శరీరతత్వం అని చెప్తారు, కాని కేవలం అదేసిద్ధాంతం క్రింద నమ్మక పెట్టుకుని ఉపేక్ష చెయ్యడం అంత మంచిదికాగు. ఎందుచేతనంటే, ఉష్ణతత్వం, వాతతత్వం, పైత్యతత్వం అంటూ శరీరతత్వంలో అనేక రకాలున్నాయి.

వీటిలో వాతతత్వంగల శరీరం ఉన్న వాళ్ళు ఎక్కువ తినకపోయినా సహజంగా లావుగా, బొద్దుగా కనబడ్తారు. దానికి తోడు మనిషి మసలాడకుండా ఏమాత్రం బద్ధకపడినా మరింత లావెక్కుతారు. ఆపైన చిరుతిళ్ళుకూడా ఎక్కువ తింటే ఇక చెప్పనక్కరలేదు. తాటకి, పూతన, బకాసుర, భీమావతారాలు దాల్చి పర్వతాకారంతో గున్న ఏనుగులాగా తయారవుతారు.

ఏతావతా తేలిందేమిటంటే, ఏమనిషికైనా శరీరం ఊబదేరి లావెక్కకుండా ఉండాలంటే పొట్ట పెరగకుండా జాగ్రత్త పడాలి. అంటే వీలైనంతవరకూ బద్ధకపడకుండా మనిషి మసలాడుతూ వుండాలి. అదేపనిగా చిరుతిళ్లు తినడం, ఎక్కువసేపు నిద్రపోవడం, బద్ధకంగా కూర్చుని బాతాఖానీ కొట్టడం మానుకోవాలి.

ఈ ప్రకారంగా చేస్తే సహజంగా సన్నగా వున్నవాళ్ళు లావెక్కరు సరికదా, లావెక్కినవాళ్ళు కూడా క్రమంగా సన్నబడడానికి వీలుంటుంది.

అంటే ఆహార విహారాల విషయంలోనూ, అన్నపానాల విషయంలోనూ ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటూ బద్ధకం, చికాకువంటివి లేకుండా




"అత్తగారూ జపానుయాత్ర" అన్న రచన ఎంతో ఆహ్లాదకరంగా ఉన్నది. ఇటువంటి వినోదకరముగా నుండు రచనలను వారు అందచేస్తున్నందుకు భానుమతీ రామకృష్ణ గారికి నా హృదయపూర్వకాభివందనములను 'వనితావాణి' ద్వారా తెలుపుటకు ఎంతో సంతోషించుచున్నాను. కాని వారు ఈ విధంగా పత్రికకు వారి అత్తగారి జపానుయాత్రను గురించి వ్రాసిన విషయం వారి అత్తగారికి తెలుసా? లేక అదికూడ జపాను యాత్ర విషయము వలెనే రహస్యముగా దాచబడిందా అన్న సమస్యమాత్రము నాకు సమస్యగానే ఉండిపోయింది.

గిరిజ, (బళ్లారి)

ఈ కథను నేను మా నాయనమ్మదగ్గిర కూర్చొని చదివాను. ఇక చూసుకోండి— ఇద్దరము పొట్టచెక్కలయేట్లు నవ్వుకొన్నాము. ఈ నవ్వులో మా నానమ్మ తలక్రిందులయిందంటే నమ్మండి. ఈ కథను నేను, మా నానమ్మ యీ జన్మలో మరచిపోలేము.

సుమతి, (ఉదయగిరి)

* * *

'అత్తగారూ జపానుయాత్ర' వ్యాసము చదువుతున్నంతసేపూ నాకు నవ్వు ఆగలేదు. 'అబ్బే, రైల్లో తీసుకెళ్ళినన్ని సామాను లెందుకురా! మటసంగాకే తెస్తాన్లే' అని జపాను యాత్రకు చిన్నగోతం సామాన్లకు లిస్టు చెప్పిన అమాయకపు అత్తగారిమాటలకు పొట్ట చెక్కలయ్యేంత నవ్వొచ్చింది. మా వారిచేత చివాట్లుకూడ తిన్నాను. ముందు దక్షపోటయు లయినాక, వ్యాసం ఒక మాటు చదివి వినిపించాక ఆయనకూడ మాతో కలిసి నవ్వారనుకోండి!

సున్నితమైన హాస్యంతో పత్రికలను అలంకరించిన రచయిత్రి భానుమతీరామకృష్ణ గారికి నా సంతోషమును ఆంధ్రపత్రిక ద్వారా తెలియచేస్తున్నాను.

కోరుకుంచి మాధవి,
(విజయనగరం.)

* * *

భానుమతీ రామకృష్ణ వ్రాసే ప్రతీ వ్యాసాన్ని, మా కోడలు ఎంత పనున్నా సరే అక్కడ విడచిపెట్టేసి, ముందుగా నాదగ్గిర కొచ్చి గట్టిగ చదివేస్తుంది. "ఈ వ్యాసం ఎంత బావుందో చూడత్తా" అంటూ. ఆ వ్యాసాన్ని వింటున్నప్పుడంతా నా కెందుకో అదోలా వుంటుంది, భానుమతి గారికి యింకా ఎన్ని వ్యాసాల్లో నాఅత్తగార్ని "హీరోయిన్"గా ఆడించాలనుందో ??

యస్. వరలక్ష్మమ్మ, (మద్రాసు)

* * *

భానుమతీ రామకృష్ణగారు రచించిన 'అత్తగారూ-జపాను యాత్ర' చాలబావుంది. క్రితంవారంలో శ్రీ గారు లావుఅవడానికి ఉపాయం చెప్తున్నారు. నాకు తోచినది చెప్తాను.

లావుగావున్నవాళ్లు సన్నగా ఎలా అవడం అనుకోవడం సన్నగా వున్నవాళ్ళు లావుగావుంటే బాగుంటుందని బాగా వున్నవాళ్ళు అరె మరీ ఇంత పొడుగ్గావున్నా మేమిటనుకోవడం పొట్టిగా వున్నవాళ్లు కొద్దిగా పొడుగ్గావుండడానికి హైహీల్స్ అవీ వేసి అవస్థపడడం సామాన్యంగా చూస్తున్నాం.

మా ఫ్రెండ్ ఒక అమ్మాయి వుంది. ఆ అమ్మాయి ఎన్ని టానిక్కులు తాగినా ఏం చేసినా చీపురుపుల్లలా సన్నగానే వుంటుంది. అందరూ అల్లాగే అనికూడా అనలేను.

కొద్దిగా ఆహారంలో మార్పు తెస్తే లావు అవడానికి అవకాశం లేకపోలేదు.

అబ్బే నాకు వంకాయలు పడవండి అనీ అరటికాయ అసలే కిట్టదనీ టమాటోలు వాసనవేస్తాయనీ అన్నిటికీ వంకలు పెట్టి చాలామంది బలమయినవి కొన్ని తినరు. ఇలా చెయ్యకుండా అన్నీ తినడం అలవాటు చేసుకొని ఆహారం ఎక్కువ చెయ్యాలి. ఒక్కసారి తినలేకపోతే 3, 4 గం॥ అభ్యాసంలో తింటే మంచిది. స్వీట్సుతిని మధ్యాహ్నం నిద్రపోతేకూడ లావవుతారని కొందరంటారు. ఎంతవరకు నిజమో తెలియదు.

టి. ఎస్. ఆర్. కృష్ణ (తిరుపతి).

* * *

సీతామదన్ గారూ! భార్గవిగారు సన్నబడటానికి మార్గమడిగితే వీరు లావవ్వడానికి మార్గమడిగారు. సిస్టర్! ఎందుకండీ మీ కంత దిగులు, ఆరోగ్యంగా ఉంటే సన్నంగా ఉంటేమాత్రం ఏమండీ?

రామలక్ష్మిగారు వ్రాసిన "మనకు కనిపించని అలవాట్లు" అన్న వ్యాసం చదువుతూ ఉంటే "నీలో ఈ చెడ్డఅలవాటు ఉంది సరిదిద్దుకో" అని ప్రతివాక్యం నాకేసి చూపెట్టినట్టుంది. ప్రతి ఒక్కరికి ఏదో ఒక చెడ్డ హాబిట్ ఉంటుందనుకోండి. అయితే కొందరి అలవాట్లు మరీ ఎక్కువగా ఉంటాయి. భానుమతి రామకృష్ణగారి "అత్తగారూ-జపానుయాత్ర" అన్నకథ చాలా తమాషాగా వ్రాశారు,

డి, సరోజమ్మ, (వుద్దికొండల)

* * *

సినీతార భానుమతి వ్రాసిన "అత్తగారూ జపానుయాత్ర" అన్న వ్యాసం చాలా బాగుంది, వ్యాసరచయిత్రి శ్రీమతి భానుమతి గార్కి వనితావాణిద్వారా నా అభినందనలు అందచేస్తూ ఎల్లప్పుడూ ఇటువంటి మంచి వ్యాసాలే వ్రాసి పాఠకులను ఆనందపరచమని కోరుచున్నాను,

యం. డి. నిజాముద్దీన్, (అకివీడు)

★

---

తమపనులు తాము చేసుకుంటూ వున్నట్టయితే సన్నగా వుండడానికి అవకాశం వుంటుంది. కలిగినవాళ్ళకి కావలసినంతమంది నౌకర్లుంటారు కనుక ప్రత్యేకం తాముగా చేయవలసిన పనిపాట్లు తక్కువ. అలాంటివారు విధిగా ఏదో ఒక పని కల్పించుకుని నౌకర్ల వెంటవెంట తిరుగుతూ వాళ్ళచేత ఇంటి పనులుచేయిస్తూ వుంటే సరి. అందువల్ల తమ స్థూలశరీరాలు తగ్గడమే కాకుండా పనివారి మూలంగా జరిగే దుబారా దుర్వ్యయాలు కూడా కొంత తగ్గుతాయి. ఇవన్నీ పాటించడానికి స్థూలశరీరం వున్నవారికి మొదట్లో కొంచెం కష్టంగావున్నా కాస్త ఓపిక, శ్రద్ధావహించినట్లయితే ఒంట్లోవున్న కొవ్వు కరిగి సన్నంగా అవుతారు."

అన్నయ్య ఇలా చెప్పడంతా విని శ్రద్ధగా ఆలోచిస్తే నా తప్పుడికే కాకుండా ఇంటిల్లిపాదికీ జ్ఞానోదయం కలిగినట్టయింది.

"ఇప్పటి నుంచి నువ్వు చెప్పిన విధులు పాటిస్తూ సన్నబడడానికి తప్పకుండా ప్రయత్నిస్తానన్నా!" అన్నాను తగ్గుతను. ఆ ఇద్దరినీ చూస్తూ అందరం అలా వుండిపోయాం 'సన్నబడడానికిదా మార్గం' అని ఎవరికివారు వాళ్ళ మనసులోనే అనుకుని.

★

# ★ లేచిన వేళ ★

(22 వ పేజీ తరువాయి)

వొంపులూ, సొంపులూ యింపులూ అంటూ సవరించేడు. అలంకారాలతోటి ఆభరణాల కొట్టే ఫీలయినంత శరీరభాగాన్ని కప్పేడు. ఇది చాలక ముక్కుకీ చెవులకీ చిల్లులుకూడా పొడిచి బంగారం తొడిగేడు. రంగు రంగుల గుడ్డలు తీసుగొచ్చి గరగలాంటి ఆడదానికి చుట్టబెట్టేడు. వింత సువాసనలతో ఎంతో చక్కగా పూసిన పువ్వులు తీసుగొచ్చి మెతగకంపు కొట్టే ఆడదాని తల్లో తురిమేడు. ఈ ప్రేమయుగంలో మొగాడికళ్ళు కామంతో పూర్తిగా కప్పకపోయాయి. బీడీకట్టల ఎడ్వర్‌టైజ్‌మెంట్ మొదలు మోటారుకారు ఎడ్వర్‌టైజ్‌మెంటు వరకూ ఆడదాని బొమ్మే! ఆడది అందమైన దని మొగాడు పొరబాటు పడటంకంటే విషాదకరమైన విషయమేమిటంటే అది నిజమేనని ఆడది నమ్మటం! చూస్తుండగా బేడ మల్లెపువ్వులు తలలో దూర్చుకుంది. పైగా నెక్లెస్ రిపేరు చేయించలేదని నేరం. పట్టుచీర కొవాలిట వాళ్ళక్కకి! బెంగుళూరుసిల్కు - అందులోనూ అరుగజాలుచాలదు ఏడు గజాలు!

నాన్‌సెన్స్!

* * *

"గుడ్‌మార్నింగ్ బ్రదర్" అన్న మేలుకొలుపూ, మృదువుగా నడ్డిమీద్దో చరుపూ తోటి మెలకువ వొచ్చింది. ఎదురుగా మధు కనబడ్డాడు.

"థేంక్స్" అన్నాను.

"దేనికిరోయ్!"

"పొద్దున్నే నీమొహంచూపెట్టినందుకు"

"అవునుకాని నీకీ శిరచ్ఛేదం ఎవడు చేశాడురా! అసలు ఈతలా ఈదుప్పటీ ముసుగూ పరాకుగాచూసి మీ మేనత్తేమో అనుకుని నాలిక కరుచుకుని బయిటకి పోయాను: కొంపదీసి ఈడైలామా శిష్య వర్గంలోకాని చేరిపోతున్నావా!"

"మా బంట్రోతుగాడు చేసిన పనేరా యిది"

"డామిట్. బంట్రోతుచేత చేయించుకోవడమేమిట్రా! ఓ అర్ధరూపాయి పారేసి మంగలిచేత చేయించుకోవాలి కాని!"

"అబ్బ! నిన్నటి విషయాలన్నీ కెలికి నన్ను బాధపెట్టకు."

"ఆల్‌రైట్. ఇంతకీ నీ దుఃఖాన్ని పంచుకోడాని కివ్వాళ ఓపిగ్గాని తీరుబడిగాని నాకులేదు. ఇవ్వాళ మా అమ్మాయి బారసాల"

"జ్ఞాపకముంది" అన్నాను మంచంమీంచి లేస్తూ.

"సకుటుంబంగా..."

"అంతదృష్టంలేదు బ్రదర్" అన్నాను టూత్ బ్రష్ వగైరా లందుకొని వరండాలోకి వస్తూ.

మా ఆవిడప్పుడే ప్రవేశించింది. మధు ప్రాధేయపూర్వకంగా ఆహ్వానించేడు. వాళ్ళక్కయ్య బావా వగైరాలు ఒంటి గంట రైల్లో దిగుతున్నారనీ, వాళ్ళ ఆగమనానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేయ్యాలి కనక తను రాలేననీ, బహుశా నేరావచ్చుననీ చెప్పి లోపలికెళ్ళింది.

"మొన్న పొద్దున్న కూడా వస్తామని మాటిచ్చేరు కాదుం?"

"నిన్న పొద్దున్నే వచ్చిందీ దురావస్థ."

"వాళ్ళందరూ వొచ్చేక కలసిరండి"

"మా ఆవిడతో చెప్పు"

"ఏమి టసలు వాతావరణ మింత పొడిగా వుంది!"

"ఎలా గ్రహించేవు?"

"మీ ఆవిడ కళ్ళెర్రగా వున్నాయిలే పైగా ధోరణికూడా చాలా....." ఇంతలోనే మా ఆవిడతెచ్చిన కాఫీ అందుకుని "ఏ వమ్మోయ్...రానంటే నే నూరుకోను. మీ అక్కయ్యా బావా వస్తున్నారంటే నాకు మరింత సంతోషంగా వుంది. వాళ్ళందర్నీ వెంటబెట్టుకుని భోజనానికి తీసుకు రండి. ఎంతాలస్యమైనా పర్వా లేదు." అన్నాడు మధు.

"అలా నిర్బంధం చెయ్యకం డన్నయ్యగారూ. మరోసారి వస్తాం. వాళ్ళు తిరపతినుంచి వస్తున్నారు. ఆదరా బాదరాగా బయల్దేరి మళ్ళీ మీయింటికి భోజనానికి రావడమంటే ......... మీకు తెలీకుందేముందీ, లేకపోతే మీయింటికి రావడానికి మొహమాటమంటూ రా!... మీ కుత్సాహభంగం కాకుండా ...... ఆయనెలాగా వొస్తారు." అంటూ జడివాన లాగ ఒకవిసురు విసిరి లోపలికెళ్ళింది.

ఒక నిమిషం తర్వాత మధూ అనినేను పిలిచీవరకూవాడు "తెప్పరిల్ల లేదు. ఒక్కగుక్క కాఫీతాగి మైగాడ్! ఏదో పెద్ద తుఫానే లేవదీసినట్టున్నావు! ఇంతకీ ముంచుకొచ్చిన ఉపద్రవ మేమిటి!" అన్నాడు మధు. "అంతా లేచిన వేళా విశేషం బ్రదర్" అంటూ నిన్నటి నావిషాద గాధ టూకీగా, ఫీలయినంత గొంతు స్థాయి తగ్గించి, కొంత సాంకేతిక భాషలోనూ, కొంత అభినయంతోటి చెప్పేను.

"పేకాట సిగరెట్లూ మానెయ్యమని బోధించే టంతటితోడల్లుడేవుంటే నేను వాడికి బ్రహ్మరథం పట్టివుండేవాణ్ణి. అలాంటిది వాణ్ణి వెధవా బోడీ అని పైగా తంతానంటావా!"

"అదే పొరపాటయి పోయిందిరా.. ఏదో ఆవేశంలో అనేశాను."

"సాక్షాత్తూ మీ ఆవిడతోబుట్టువుకదా! ఓ పట్టుచీర కొనమని ఆవిడ అడుగుతే ఇంత రాద్ధాంతం చేస్తావా! అంత పట్టుచీర కొనడం యిష్టంలేదనుకో అప్పట్లో 'ఊ...' అని తర్వాత తొంభయి రకాలుగా ప్లేటు మార్చెయ్యొచ్చుగా."

"అదీ రైటే అనుకో."

# ★ లేచినవేళ ★

"ఒరేయి మనకి శుచిగా, రుచిగా వంట చేసి పెడుతూ, ఇల్లూ పిల్లల్నీ చక్కబెట్టుకుంటూ, తిరుగుబాటు చెయ్యకుండా, కేవలం తిండీ బట్టాతో తృప్తిపడుతూ చాకిరీ చెయ్యడానికి భార్యకంటే వానిసెవరు దొరుకుతుందిరా ఈ ప్రజాస్వామిక యుగంలో. పాపం! ఆ యిల్లాలు నన్ని మాటలన్నావు...."

"బ్రదర్. అవును. ఇప్పటికే పశ్చాత్తాపాగ్నిలో దగ్ధమయిపోతున్న నా హృదయం మీద నీమాటలతో పెట్రోలుపోస్తున్నావు."

"పోనీ నిన్నరాత్రి మీ ఆవిడ రెండు కాళ్ళూ పట్టుకోలేకపోయావురా"

"రాత్రి మూడ్ రాలేదురా"

"చూడు. లోపల కుర్రాడేడు మున్నట్టున్నాడు. ఇదే సమయం. కొస్పు కుర్రాణ్ణెత్తుకునో ఉయ్యాల ఊపుతూనో ఉండి, దాసీది లేకుండా చూసి మీ ఆవిడ దగ్గిరకి రాగానే

"అన్యథాశరణం నాస్తి...త్వమేవశరణం మమ. పాహిమాం పాహిమాం" అంటూ ఒటేమని ఒక సాష్టాంగ ప్రణామం కొట్టెయ్యి. మరుక్షణంలో నే నువ్వు సింహాసనం మీదుంటావు. మీ ఆవిడ నీకాళ్ళ దగ్గిరుంటుంది."

"శ్రీకృష్ణుడంతటివాడికి తప్పలేదు. సరే నువ్వేళ్ళగానే కార్యక్రమాని కుపక్రమిస్తా."

"అవశ్యం! ఇదిగో యిప్పుడే పోతున్నాను. శీఘ్రమేవ భార్యాకరుణాకటాక్ష వీక్షణా ప్రాప్తిరస్తు."

"ధన్యోస్మి."

నేను యింట్లో అడుగుపెట్టేలోగా మళ్ళీ బయటనుంచి మధు కేక వినపడింది. నాపేర వచ్చిన టెలిగ్రాం సంతకంపెట్టి తీసుకుని నాకందించేడు. కారణాంతరాలవల్ల నిన్న రాత్రి రైలులోనే మీతోడల్లుడు సకుటుంబంగా యింటికి వెళ్ళిపోయాడుట. ఇక్కడ దిగనందుకు మన్నించమనీ వార్త. మధూకి అందించేను.

"నిన్న ఆవిణ్ణి నువ్వుపెట్టినక్షోభ, నిన్న రాత్రి ఆవిడ అనుభవించిన మనోవ్యథ, ఈ రోజు ఈ టెలిగ్రాంవల్ల కల్గిననిరుత్సాహం వల్ల ఆవిడ మనస్సు..."

"నీ ఏడుపు ఉపన్యాసం ఆపరా. అసలే నాతల తిరిగిపోతుంది."

"ఏతోడల్లుడు నీయింటికొస్తే అవమానిద్దామనుకున్నావో ఆ తోడల్లుడు నీయింటికి రాకుండానే నీమీద పగసాధించేడు. అనుభవించు."

"నోరుమూస్తావా తన్నమంటావా?"

"సరే. నేచెప్పినట్టు చెయ్యి. ఈ టెలిగ్రాం మాట మరిచిపోయి ఇందాకా నే చెప్పినట్టు సంధిప్రయత్నం చెయ్యి. అరగంటలో సిటీ సిల్కుపేలస్ కుర్రాణ్ని బెంగుళూరు సిల్కు చీరలూ వగైరాలు తీసుకుని యిక్కడికి రమ్మంటాను. బేరాలాడుతూ కాలక్షేపం చెయ్యి. సరిగ్గా అదేసమయానికి మాయింటి పక్కనేవున్న స్టేట్ బ్యాంక్ లో ప్యూన్ని బతిమాలి వాడి చేతికిచ్చి యీ టెలిగ్రాం పంపిస్తాను. వాడికి కాకీ యూనిఫారం వుంటుంది. ఒకవేళ మీ ఆవిడచూసినా అనుమాన పడదు."

"అంతటి మహాపాతకానికి నా అంతరాత్మ ఒప్పుకోదురా."

"చచ్చినట్టు ఒప్పుకుంటుంది. నేను చెప్పేనని చెప్పు. చూడు. ఆ నెక్లెస్ యిలా పడేయ్. చంపకమల్ షాపులో చెప్పి అరగంటలో నీకు పంపించేటట్టు చేస్తాను."

"థేంక్స్.. అన్నట్టు, అన్యథాశరణం నాస్తి...తర్వాత?"

"త్వమేవ శరణంమమ...తరవాత టూ టైమ్సు పాహిమాం."

"నోరుతిరగటం లేదురా"

"నీవే తల్లివి తండ్రివి, నీవే గురుడవు దైవము...పద్యమొచ్చునా?"

"ఆహా."

"సరే అదే కానియ్యి. అంత ఘాటుగా లేకపోయినా పనిజరుగుతుంది. ఆఁ...మరిచిపోయేను. సిటీసిల్కుపేలస్ వాడి దగ్గర మీ ఆవిడకో మంచి బెంగుళూరు సిల్కు చీరొకటికొను."

"అదెందుకురా?"

"ఆ టెలిగ్రాం వినగానే మీ ఆవిడ మూర్ఛపోతుందికదా. తర్వాతావిడ పరితాపం ఉపశమించాలంటే..."

"ఆమాత్రం జుర్మానాయైనా నాకు పడాలంటావ్!"

"చచ్చినట్టు"

"సరే కానియ్యి. ఇంతకీ యిదంతా నిన్నటి దుర్దిన శేషమనుకుంటాను. ఒరేయ్! ఈ కార్యకలాపమంతా ఒకగంటలో అయిపోవాలి. లేకపోతే మాఆవిడ వంటకి ఉపక్రమిస్తుంది."

"రైటో."

తు. చ. తప్పకుండా అక్షరాలా మావాడుపదేశించిన తారకమంత్రం కార్యరూపంలో పెట్టేను. మాచంటాడూ, ఫిరోజ్ ఫ్లాస్కు, రబ్బరుగుడ్డా, పాలబుట్టాతో సహా రిక్షాయెక్కి మధుయింటికి బయలుదేరి వెడుతూవుంటే ఆ బెంగుళూరు సిల్కుచీర ధగధగా మెరిసిపోతుంటే నాకళ్ళు చికట్లు కమ్మేయి. ★



(గత వారం తరవాయి)

పీడకలలతో మనస్సు చెదిరి, అనుకోని పరిస్థితులవల్ల భయంపెరిగి, వికలచిత్తంతో తెల్లవారగానే లేచింది కమల. రాత్రి ఆ గృహానికి వచ్చిన విటులు విడిచిన సిగరెట్టు ముక్కలు చెదిరి క్రిందపడి ఉన్నాయి. గత స్మృతులన్నీ మనస్సులో కదిలాయి కమలకు సిగరెట్టు పీకల మసిలా మనస్సు నిండా ఆందోళన వ్యాపించింది కమలకు.

తడికెలగదిదాటి వరండాలోకి ప్రవేశించింది. ఆ యింట్లోని యువతులు యింకా నిద్రమత్తులో సొమ్మసిల్లి పడి ఉన్నారు. పౌడరు ముఖాలు చెమురుతో నలిపెక్కి అసహ్యంగా, వికారంగా కనిపించాయి. నలిగిపోయిన దుస్తులతో. శరీరాలతో నిద్ర బడలికంతో సాచుకొని పడుకున్న ఆ స్త్రీలు రసంతీసినపిదప విడిచి విసిరిన చెరుకుపిప్పి కుప్పల్లా కనిపించారు.

ఏజీవితం తరచిచూచినా ఏదో వైచిత్ర్యం కనిపించక మానదు. కాని ప్రతిజీవి తన జీవితంయొక్క వైచిత్ర్యం మిగిలిన తక్కిన వాటికన్న ఎక్కువ ప్రత్యేకత మాత్రం కలిగిఉందనే భావంతో గడుపుతూ ఉంటుంది. అనేక అనుభూతులతో గడచిన మూడు సంవత్సరాలలో కమలజీవితంలో కలిగిన మార్పులు ఆమెకే ఆశ్చర్యం కలిగించాయి. తన ఎదుట నిద్రమైకంలో నిశ్చింతగా ఉన్నస్త్రీల జీవితాల్లో ఎటువంటి విచిత్రఅనుభూతులు ఉండి ఉంటాయో అనుకుంది కమల.

ముసలిది లేచికూర్చుంది. కమలనుచూసి గదిలోకివెళ్ళి పళ్ళపొడి అందిచ్చింది. వీధిలోని ఒక ఊరకుక్క యింట్లోకిచొరబడి ముసలిదాన్ని చూచి తోక ఆడిస్తూ నిలుచుంది. క్రితందినం గిన్నెల్లో మిగిలిన మెతుకులువేరి కుక్కముందు రాల్చింది ముసలిది.

మౌనంగా దంతధావన మొదలెట్టింది కమల. ముసలిది నవ్వుతోమూకుంటూ ఆమె ప్రక్కనేవచ్చి కూర్చుంది.

'నేను యీవేళ మధ్యాహ్నం ఊళ్ళోకి వెళ్ళిపోతా. అక్కడ మాబంధువులున్నారు!' కమల ఆత్రుతతో ముసలిదానివైపు చూసింది.

'మా సత్రంలో అడుగుపెట్టిన అతిథుల్ని అనవసరంగా బయటికిపంపే అలవాటులేదు నాకు. నీకు ఏమిలోటు కలిగింది?' నవ్వుతూనే ముసలిది కమల బుజంనిమిరింది.

రాముడు చెప్పినమాటలవల్ల ముసలిదాని ముందు దర్యగ్రహించుకున్న కమల మౌనంగానే ఉండిపోయింది.

కొంతసేపు గడిచాక, కుళాయిధారలో స్నానంచేసి, పెట్టెలోని వాయిలు చీర ధరించి కుంకం తిలకం దిద్దుకుని, నగరంలోకి పోవాలనే ప్రయాణసన్నాహంతో, ఏదో ఆలోచనతో వరండాలో కూర్చుంది కమల.

ముసలిది వేడికాఫీ తయారుచేసి తెచ్చింది.

'రాత్రి చేయవలసిన అలంకారం పొద్దున్నే మొదలుపెట్టావు?' కాఫీ కప్పు అందిచ్చింది కమలకు.

'నాకు కాఫీ అక్కర్లేదు!'

'ఏం?'

'ఇక్కడ ఏమీ తీసుకోదల్చుకోలేదు'

'అలాగా!' వయ్యారంగా, చోద్యంగా నిలుచుంది, ముసలిది.

'ఇది భోగంకొంప' అరిచింది కమల.

ముసలిది పకపక నవ్వింది.

'నేను తక్షణం వెళ్ళిపోతా!'

'కాఫీ తీసుకొని వెళ్ళు' ఛకిలిగానవ్వి కాఫీకప్పు చేతికి అందిచ్చింది కమలకు.

అందిచ్చే కాఫీకప్పును త్రోసేసింది కమల. కప్పు క్రిందపడి పగిలి ముక్కలైంది. కాఫీ వరండాలో కాల్వకట్టింది.

'కోపంవల్ల ప్రయోజనంలేదు!' హేళనగా మూతిత్రిప్పుకుంటూ ముసలిది వంటింట్లోకి వెళ్ళిపోయింది.

కాఫీకప్పు పగిలినచప్పుడుకు పందుల్లా దొర్లుతున్న ఆ యువతులు కళ్ళు నులుపుకుంటూ, ఒకరిమీద ఒకరుపడుతూ చిలిపి శృంగారచేష్టలు చేసుకుంటూ గారాబంగా దీర్ఘాలుతీస్తూ లేచికూర్చున్నారు. కమల తన పెట్టె, సంచీసర్దుకుని, వరండాలోకి వాటితో వచ్చింది ప్రయాణానికి సిద్ధమయి.

'క్రొత్తపిల్ల పోతోంది అమ్మా!' అరిచింది ఒకయువతి.

'పోయేదాన్ని ఎవరాపగలరు?' నవ్వింది ముసలిది. పెట్టె, సంచీ, చేత్తోపుచ్చుకుని గబగబ వీధిగుమ్మంవైపు చిన్నసందులోకి నడిచింది కమల.

నిన్నరాత్రి కనిపించిన సాహెబు గుమ్మానికి అడ్డంగా కూర్చున్నాడు. అతనిప్రక్కనే ఆరడుగుల అజానుబాహువు తిరగలి దిమ్మలాంటి వక్షస్థలంతో, కోరమీసాల వస్తాదు కమలను పట్టుకుందామని కండలు తిరిగిన బాహువులు చాచి భయంకరంగా నవ్వాడు.

'ఏంపిల్లా! ఏడకు పోదామని!'

ఒక క్షణం నిశ్చేష్టురాలై నిలుచుండిపోయింది కమల. కబంధుడిలా కదిలి ముందుకు వచ్చాడు వస్తాదు చేతులు చాచుకుంటూ. ఆబలమైన చేతులతో ఆటబొమ్మను ఎత్తినట్లు కమలను ఎత్తి పట్టుకున్నాడు. భయంతో బిగ్గరగా అరిచింది కమల. సాహేబు తన గడ్డాన్ని కంపింపజేస్తూ పకపక నవ్వాడు. ఆమె చేతుల్లోంచి జారిన పెట్టె, సంచి గబుక్కున అందుకున్నాడు. వస్తాదు కమలను చేతులతోఎత్తి గబగబ నడిచి వరండాలో కూలవేశాడు. కమల గిజగిజ తన్నుకుని కోపంతో వస్తాదు చెయ్యి కొరికేసింది. 'పెంకి పీనుగ!' కొరికినచెయ్యి నిమురుకున్నాడు వస్తాదు. గళ్ళలుంగీ సాహెబు ఆనందంగా గంతులువేశాడు. ముసలిది విరగబడినవ్వింది. యువతులు కొందరు ముసిముసిగా నవ్వారు. కొందరు మౌనంగా తిలకించారు పరిస్థితి. కమల వెక్కివెక్కి ఏడ్వసాగింది.

'పిచ్చిపిల్లా ఏడుస్తే ఏం లాభం?' ఒకతె పాచిముఖం కంపుతో కమల ముఖంలో ముఖం పెట్టింది.

కమల అసహ్యంగా ఆమెను గెంటేసింది.

'ఈరాత్రి రంగంలోపడితే, అదే వడి ఉంటుంది ఈపిల్లను జాగ్రత్తగా చూసే బాధ్యతనీది!' ముసలిది వస్తాదువైపు సైగ చేసింది.

పాచి ముఖాలతోనే కాఫీలు త్రాగడానికి వంటింట్లోకి నడిచారు స్త్రీలు.

రాముడువచ్చాడు. పరిస్థితిచూసి, తాను నిన్నరాత్రి కమలకుచెప్పిన విషయం తారుమారైందని గ్రహించాడు.

నగరంలో బంధువులున్నారనే నెపంతో కమలను ఆయింటినుంచి బయటకు తీసుకువెళ్ళే సన్నాహంలో ఉన్న రాముడు ఆపరిస్థితి చూసి నిరుత్సాహపడ్డాడు. భోగంకొంపలో పడిపోయానన్న బాధతో ఉక్రోషంగా పరిస్థితిని జాగ్రత్తగా పరిష్కరించటానికి బదులు పారిపోతున్న సంగతి ముసలిదాని

(47-వ పేజీ చూడండి)



# బాల సాహితి



గాలి రివ్వున వీస్తోంది. నల్లటి మబ్బులతో ఆకాశం అంతా నిండి పోయింది. నాగరాజు బడినించి వస్తూనే సావిట్లోంచి గది మంచంమీదకి పలకా పుస్తకాలు విసిరేసి మరీ పరిగెత్తబోయాడు ఆడుకోడానికి.

వాళ్లమ్మ కేకేసి ఆపింది. వానొస్తుంది. వెళ్లొద్దు బాబూ అంది ముద్దుగా. నాగరాజు మామూలుగానే గునిశాడు అమ్మపెట్టే నాలుగు అందుకోవడం కోసం. అందుకోసమే వాళ్లమ్మకూడా కోపం తెచ్చుకుంది. గుమ్మం కదిలితే కాళ్లు విరగ్గొడతా అంది.

వాళ్ళమ్మ ఎందుకేనా మంచిదని పైకిపడ ధడవా అని మేడమీదకి తీసుకుపోయి రెండు చేగోడీలూ నాలుగు చివాట్లు పెట్టింది. తరవాత చీకేబుక్కూ, లెక్కలబుక్కూ పలకా బలపం చేతికిచ్చి గదిలోవేసి గొళ్ళెంపెట్టి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

నాగరాజుకి కోపం వచ్చింది. కొంచం సేపు ఏడ్చిచూశాడు గట్టిగా. అమ్మ తలుపు తియ్యలేదు. కిందకి వెళిపోయిందికామోసు. ఇంక ఎలాగా వినబడదు ఏడ్చినా. అందుకని నాగరాజు ఏడుపు మానేశాడు. పుస్తకాలూ అవీ ఓమూలకి తోసేశాడు. అమ్మ పెట్టిన చేగోడీలు చప్పుని అయిపోకుండా మెల్లిగా నముల్తూ, చివాట్లు నెమరువేస్తూ, కిటికీలో చూస్తున్నాడు పిల్లకోతిలా. బయట కోతి పిల్లలు ఆడుకుంటున్నారు. వాళ్లు పుట్టి పెరిగి ధడవలనుకో... ఇంకో రెండు చేగోడీ లిచ్చినా బావుండును అనుకున్నాడు నాగ రాజు... ఎదురింటి వాళ్ళింటిమీద గద్ద వాలింది. ఇంటిమీద గద్ద వాలకూడదుట. వాలితే ఇంట్లోంచి వెళ్ళిపోవాలి.. దూరంగా బండరాముడు వస్తున్నాడు. వాడిచేతిలో పకోడీల పొట్లంవుంది. పొట్లంవాసన చూసు కుంటూ, నాడియావారి వాడియాకి జై అని అరుస్తూన్నాడు బండరాముడు. పకోడీలు బాగుంటాయి. నారాయణకొట్టులో సాయం కాలం వేయించే ఉల్లిపాయపకోడీలు మరీ బావుంటాయి.. నాగరాజుకి నోరూరింది. బండరాముడు పకోడీలపొట్లం పైకి ఎగరేసి పట్టుకుంటూ నాగరాజుకేసి చూసి వెక్కిరిం చాడు. 'పకోడీలోచ్చి' అన్నాడు వాడు ఎనిమీపార్టీవాడు. నాగరాజుకి కోపం వచ్చింది. ఎదురింటిమీద గద్ద వీడిచేతులో పొట్లం తన్నుకుపోవాలమ్మా అలాచేస్తే 70 వేల 2 వందల 19 కొబ్బరికాయలు కొడతా నమ్మా అని దండం పెట్టుకున్నాడు. సరిగ్గా అప్పుడే గద్దకూడా బండరాముడి చేతిలో పొట్లంచూసింది. దానికీ నోరూరింది. వెంటనే ఒక్కసారి రెక్కలాడించి ఆకాశంలోకి ఎగిరింది. మళ్ళీ రెక్కలాడించకుండానే అలా ఎగురుతూ బండరాముడి నెత్తిమీద నాలుగైదుసార్లు చక్రాలు కొట్టింది. నాగ







# సీరియల్

రాజు గద్దలు ఎగరడం చాలాసార్లు చూశాడు గాని, ఈసారి మాత్రం చాలా ఆశ్చర్యం వేసింది. అసలవి కాకిలాగా పిచ్చికలాగా రెక్కలు ఊగించడం లేదు అనుకున్నాడు. వాడికి కూడా ఎగరాలనిపించింది. గదిలో నే ఎగిరి చూశాడు చేతులుజాపి. ఊహూ లాభంలేదు. మళ్ళా కిటికీ దగ్గరికివచ్చి చూశాడు. పైన తిరుగుతున్న గద్ద రివ్వున కిందికి వాలి, అమాంతంగా బండరాముడి చేతిలో పొట్లం తన్నుకుని రుయ్యుని మళ్ళీ ఇంటి కప్పు మీదికి ఎగిరిపోయింది. నాగరాజుకి భలే సంతోషం వేసింది.

తరవాత మళ్ళీ ఆశ్చర్యం వేసింది. అసలు ఈ గద్ద అలా ఎలా ఎగిరిందీ అని. చాలా సేపు ఆలోచించాడు. వాడికి తెలియలేదు.

ఆమధ్య—అంటే చాలా ఏళ్ళక్రితం చాలామంది కుర్రాళ్ళకి ఇలాగే బోలెడు సందేహాలు వచ్చాయి.

జేమ్స్ వాట్ అనే కుర్రాడుండేవాడుట. వాళ్ళమ్మ కాఫీ కెటిల్ లో నీళ్ళు (వాళ్ళు తెల్లదొరలులే) కాస్తూంటే మూతెగిరెగిరిపడుతోంది. అది ఎలా ఎగురుతుందీ అని జేమ్స్‌కి సందేహం వచ్చింది. 'ఆవిరి మూలమున ఎగురుచుండెను' అని నువ్వు ఇపుడు చెప్పకోగలవనుకో. అప్పుడు ఎవరికీ తెలీదు. మేష్టర్లకికూడా తెలీదు. ఏం? ఆ సందేహం మూలంగానే తరవాత చాలా రోజులికి రైలుబండి తయారైంది. న్యూటన్ అనే ఇంకో కుర్రాడు ఉండేవాడు. కొంచెం పెద్దావేలే. ఒక రోజుని అతను చెట్టుకింద బెంచిమీద కూర్చున్నాట్ట. ఒక ఆపిలు గుబుక్కుని అతని నెత్తిమీద పడింది. సుబ్భరంగా తినేసి పోవచ్చుగా. న్యూటను మాత్రం దాన్ని చూసి ఈ పండు చెట్టు నించి ఊడినపుడు కిందకే ఎందుకు పడాలి. పైకి పోకూడదాఅనుకున్నాడు. ఆసందేహం మూలంగా బోలెడు కొత్త సంగతులు తెలిశాయి. బండరాముడికీ అందరి గోళీకాయలు లాక్కోవాలని బుద్ధి ఉన్నట్టే, భూమికి అందర్నీ అన్నిటినీ తన దగ్గరగా లాక్కోవాలని ఒక గుణం ఉందని తెలిసింది.



సిద్ధార్థుడనే అతనికి చిన్నప్పుడే ఒక గొప్ప సందేహం వచ్చింది. ఇంతపెద్ద భూలోకం తయారుచేసిఅందులో ఇంతమంది మనుష్యుల్ని పెట్టిన దేవుడు మళ్ళీ వాళ్ళకి కష్టాలు ఎందుకు పెట్టాలి ఎందుకు జబ్బుచెయ్యనివ్వాలి. ఎందుకు చచ్చిపోనివ్వాలి. అని అతనికిసందేహాలు వచ్చాయి చాలాకాలం తరవాత అతనే మనుష్యులందరు సుఖంగా బతకడానికి మంచి పద్ధతులు చెప్పాడు. బుద్ధుడు అయ్యాడు.



ఇలా చిన్నపిల్లలికి వచ్చిన సందేహాలు ఎన్నో పెద్దపెద్ద సంగతులు తెలుసుకోడానికి సాయం చేశాయి. వాటివల్లనే గొప్పగొప్ప పనులెన్నో జరిగాయి. మనందరికీ అన్నిరకాల సదుపాయాలు సుఖాలూ వాటివల్లనే కలిగాయి.



ఇపుడు గద్దఎలాఎగిరిందని నాగరాజుకి

(54-వ పేజీ చూడండి)






# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

బొమ్మకంటి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి [విజయవాడ] అక్కల రాజబాబు [మచిలీపట్నం] పి. రవికుమార్ రెడ్డి [పోలకల చిత్తూరుజిల్లా] సి. ఒ. రంగారెడ్డి [తాడిపత్రి, అనంతపురంజిల్లా] టి. జి. శివలింగయ్య [యాపర్ల, మహబూబ్ నగర్ జిల్లా] కోడూరి హనుమంతరావు [నరసాయపాలెం, గుంటూరుజిల్లా] బొగ్గారపు చిట్టిపుల్లాజీరావు [అనకాపల్లి, విశాఖజిల్లా] ధూళిపాళ్ళ ప్రకాశరావు [నూజివీడు కృష్ణాజిల్లా] ఎస్. జ్యోతి [సికింద్రాబాదు] కె. వెంకటేశ్వర్లు [నల్లపోచమ్మవాడ కరీంనగరంజిల్లా] నూరం సరస్వతీబాయి [హైద్రాబాదు].

కలూరి అంజయ్య (నెల్లికుదురు, వరంగల్లు జిల్లా] భద్రిరాజు భాస్కరలక్ష్మి [హాస్పేట బళ్లారి జిల్లా] బి. రామచందర్ [సికింద్రాబాదు) భమిడిపాటి దుర్గాప్రసాద్ [విజయపురి నార్త్ నల్లగొండ జిల్లా] భావ్వరపు లక్ష్మీనరసమ్మ [యల్లమిల్లి తూ. గో. జిల్లా] తాడిమేటి రాఘవరాణి [ఏలూరు] డి. భారతీదేవి [హైదరాబాదు] దశిగి వెంకటప్పారావు [ఖుర్దారోడ్ పూరీ జిల్లా] సి. విజయలక్ష్మి [మైసూరు] కటికినేని అనూరాధ [కాకినాడ] యపవల్లి శ్రీరామచంద్రమూర్తి [కడప] వై. రామమోహనరావు [చేర్యాల వరంగల్లు జిల్లా] కర్రి పార్థసారథి సాలూరు [శ్రీకాకుళంజిల్లా] యపవల్లి సత్యనారాయణమూర్తి [తెనాలి, గుంటూరుజిల్లా] జొన్నలగడ్డ కనకాచలం [వాల్తేరు] గండికోట కృష్ణవేణి [కాకినాడ] టి. అనంతపద్మనాభశర్మ [నంద్యాల కర్నూలుజిల్లా] పిల్లలమర్రి వెంకటరామనరసింహప్రసాద్ [చల్లూరు నల్లగొండ జిల్లా] భీమవరపు వెంకట రామసుబ్బారావు [గుంటూరు] ఆర్. భరత్ కుమార్ [బెంగుళూరు]

డి. సోమశంకరం పేరూరు [తూ. గో. జిల్లా] కె. సత్యనారాయణ (పెనుగొండ అనంతపురం జిల్లా] వెలుతురుపల్లి వీర్రాజు [తోంద్రంగి శ్రీకాకుళం జిల్లా] ఆంధ్ర లలితాకుమారి [విశాఖపట్నం] ఎంగ్లార్ విల్లింగ్టన్ [హైదరాబాదు] వై. శివకుమార్ [కలకత్తా] జక్కా ఆదెప్ప (ధర్మవరం అనంతపురంజిల్లా) దూర్వాసుల విజయలక్ష్మి (న్యూఢిల్లీ) వడుమత్తి రాజేశ్వరరావు (గుంటూరు) పి. నాగేశ్వరరావు (వైరా).

డి. రవీంద్రనాథరెడ్డి (తిమ్మనచర్ల అనంతపురంజిల్లా) వడ్డాది విద్యావతి (నరసన్నపేట శ్రీకాకుళంజిల్లా) వడ్డాది నాగమణి (నరసన్నపేట శ్రీకాకుళంజిల్లా) మట్టే రత్నకుమారి (యేలేశ్వరం తూ. గో. జిల్లా) మట్టే ప్రకాశరావు (యేలేశ్వరం తూ. గో. జిల్లా) ఎన్. క్రిష్ణయ్య (రామగిరి చెంగల్పట్టుజిల్లా) సావిత్రి (కోరటమద్ది కర్నూలుజిల్లా) జానగంగాధర ప్రభాకరరావు (జగ్గన్నపేట తూ. గో. జిల్లా) మహేశ్వరం సాంబశివరావు (చదలవాడ గుంటూరుజిల్లా) డి. మల్లికార్జునరావు (ఆదోని)

ఈడూరి సీత (కోటిపల్లి తూ. గో. జిల్లా కె. భక్తవత్సలం (తిరుపతి చిత్తూరు జిల్లా) శిరిపురపు రాజేంద్రప్రసాద్ (చిట్టాల కృష్ణాజిల్లా) కొమ్మ కృష్ణానంద శర్మ (కొవ్వూరు ప. గో. జిల్లా) జన్యావుల మస్తాన్ రావు (విజయవాడ) ఘంటసాల భారతీదేవి (ఖుర్దారోడ్ పూరీజిల్లా) మంచికంటి లీలావతి (కుప్పం చిత్తూరుజిల్లా) వెంపరాల కామేశ్వరీదేవి (రాజోలు తూ. గో. జిల్లా) బెహరా వెంకటరమణమూర్తి వేణమ్మపేట (శ్రీకాకుళం జిల్లా) పద్మశాలి నరేందర్ (హైద్రాబాద్) కె. యు. సుబ్బలక్ష్మి (అదోని కర్నూలు జిల్లా) జి. రామమూర్తిశెట్టి (కందూరు చిత్తూరు జిల్లా) టి. నరసింహారావు (గుంటూరు) మరంగంటి వెంకట నరసింహాచార్యులు (రాజమండ్రి) కొప్పరపు పద్మావతి (డోకిపర్రు కృష్ణా జిల్లా) జయంతి రత్నమాల [విశాఖపట్నం], పాలంకి బాల కృష్ణ [హైద్రాబాదు] పి. వీరభద్రరావు [ద్వారపూడి, తూ. గో. జిల్లా] తెరవరసు రంగారావు [న్యూఢిల్లీ] వి. యస్. మహాదేవ [విజయపురి నార్త్, గుంటూరుజిల్లా].

జి. గిరిజాకుమారి [గుంటూరు] పంచాంగం కళావతి [ద్రోణాచలం. కర్నూలుజిల్లా] కస్తూరి శ్రీరామ్ [రాజోలు, తూ.గో.జిల్లా] అళ్ళ శ్రీరామమోహన్ రెడ్డి [మున్నంగి, గుంటూరుజిల్లా] దేవబత్తిని వెంకటేశ్వరరావు [యూసుఫ్ ఖాన్ పేట, కృష్ణాజిల్లా]

★




"ఏమిటి సంగతి? నీ తోక నెవరైనా తొక్కారా?"



# సినిమా

## చిత్ర సమీక్ష | మా యింటి మహాలక్ష్మి

మాయింటి మాలక్ష్మి అనగానే అవుగాని, చివరి సీనులో శిలావిగ్రహం చేయించుకునే సినీకథా పతివ్రతా అచ్చుట్లూరా సాలికలు కరుచుకుంటూ గ్లిసరిన్ అనువాదాన్ని కురిపిస్తూ దండాలు వేస్తున్న ఆడా మగా పిల్లా జెల్లా జనాభా ఉన్న సీనుగాని గుర్తుకురావడం కొందరికి దురలవాటు. అలాటి దుష్టులు కూడా 'మాయింటి మహాలక్ష్మి'(నవశక్తి ఫిలింస్) చిత్రం చూస్తున్నంతసేపూ (దాదాపు 3 గంటలు) నవ్వుకోవడం నవ్వివోవడం మానేసి శ్రద్ధగా కూర్చుంటారు. ఇందులో మాయింటి మాలక్ష్మి పదహారణాల సినిమా సుశీలగా వేషం వేసుకుని, కళ్లు ఫొటోజెనిక్‌గా తెరుస్తూ మూస్తూ, దారుణమైన సినీ మంచితనం చూపిస్తూ తిరిగిన మాట నిజమే కాని, ఆ పాత్ర రూపకల్పనలో (జమున), వివిధ సన్నివేశాల మధ్య చిత్రణలో ప్రత్యేకత, అందుకుతగ్గ పనివాడితనం ఉన్నాయి. హైదరాబాద్‌లో తయారైన తొలిచిత్రం కావడమే కాక అంతకన్న గొప్పవనతగ్గ ప్రత్యేకతలు ఇందులో ఉన్నాయి. చాలమంది కొత్త టెక్నిషియన్‌లు ఇందులో పనిచేసి సంతృప్తికరమైన ఫలితాలు చూపించారు. కొత్త నటులు ఇద్దరిని (హరనాథ్, కృష్ణ) పరిచయం చేశారు. ఇప్పుడు వస్తున్న చిత్రాలమీద ప్రాణానికి తెరిపివిన కొత్తదనంగల కథను చెప్పారు. సగటు తెలుగు చిత్రంకన్న కథమీద ఎక్కువ గౌరవం చూపించారు. పాటలను పొదుపుగా చొప్పించారు. అన్నిటికన్న మిన్న -ముఖ్యపాత్రను గుమ్మడి వెంకటేశ్వరరావు నిర్వహించాడు. మొత్తంమీద పిల్లల తోయి చిత్రంకాదనిపించారు.

ఈ చిత్రంలో బలిగా తోచేదల్లా ఒకటే. బలంగల కథకు జవం లోపించిందనిపించింది. అందువల్ల చిత్రం మరీ పంచకల్యాణిలా పరుగులెత్తదు. పట్టపగ్గాలు లేకుండా కచ్చిపోదు. ఇక్కడినించి ఎటు పోతాం అని సారథిని అడుగుతుంది. ఆయన ఏ సంగతీ తేల్చలోగా [illegible] దగ్గర చేరి ఒకరీలు గిరీశం డైలాగుని పోగా ఒప్పగిస్తాడు. ఆలోగా గుమ్మడికి సుశీలమీద ఇంకో సినిమాటిక్ అనుమానం కలుగుతుంది.

కథ అంతా అనుమానాలమీదుగానే పోతూ ఉన్నందువల్ల మనకూడా ఈ అనుమానాలన్నీ సంభవించేవే అని అనుమానం కలగడం సహజం. ఈరకం దుష్టుల్నికూడా దర్శకుడు రామినీడు గుర్తుంచుకుని శంకపెట్టేందుకు ఆస్కారం లేకుండా చూస్తున్నది సంభవమేనన్న నమ్మకం కలిగించడానికి మంచికృషి చేశారు. ముఖ్యమైన సన్నివేశాలను చిత్రించి ఆయా పాత్రల మనస్తత్వాలను ఆవిష్కరించడంలో ఎన్నతగ్గ పనివాడితనం చూపారు. తాపీ ధర్మారావుగారు, ప్రత్యగాత్మ నిండైన పుష్టిగల సంభాషణలు సమకూర్చారు.

వయసు మళ్లిన లాయరు కాయన రెండో పెళ్ళి చేసుకుని రెండుమూడు రీళ్ళపాటు కాఫీతాగి కమ్మటి డైలాగులు చెప్పి ఆ తరవాత పెళ్లాన్ని శంకించి పొరబాటులో పడతాడు. లాజ్‌వంతి, ఇల్లరికంవంటి చిత్రాలలో లాగే ఈయనకి అనుమాన పడేందుకు కావలసిన దృశ్యాలు కావలసినంతసేపు మటుకే కనిపిస్తాయి. ఎటొచ్చి అవీ అలాటివి చాలాసార్లు జరుగుతాయి. కొంచెం కట్టుదిట్టంగా జరుగుతాయి. కొండలైనచ్చి మంచల్లె కరిగిపోతున్నందువల్ల ఆయన ధాటీగా భార్యని ఏమీ అనలేడుగాని, ఆమె పరిస్థితి పసిగడుతుంది. వరసకి కొడుకైన వాడితో కూడా మాట్లాడడానికి వీలులేని దుర్భర పరిస్థితిలో నానాతోభా పడుతుంది. ముసలాయనని గట్టిగా తెగించి కళ్ళుయిమూస్కి దారిలోయనివ్వరు అని మనం అనుకునే వేళకు ఆయన అంతపనీ చేస్తాడు.

ఆ పొరపాటుకి, ఆయన బిడ్డలూ, తెలిసినవాళ్లు వేసిన చివాట్లు, మనకూడా చిరాకు కలిగిస్తాయి. దోషిమీద కాదు; తిడుతున్న వాళ్లమీద. తెలుగుసినిమాలో గ్రూపుఫొటో సీనుదగ్గర వినబడే పేటెంటు మాటలన్నీ, కొత్తగా ఉండేలా తీసిన ఈ చిత్రం చివర పెట్టడం అన్యాయం.

ఇలా చివరా, మధ్యలో అక్కడక్కడా కొన్ని లోపాలున్నా మొత్తంమీద పతాకసన్నివేశంతో ఆరంభమైన ఈ చిత్రమంతా ఒక సుదీర్ఘమైన (17 వేల అడుగులు) పతాకసన్నివేశంలా సాగిపోతుంది. అంత పొడుగు క్లయిమాక్స్‌ను అంతసేపూ రక్తి కట్టించడం కష్టం అయినా దర్శక రచయితలూ, ముఖ్యనటులు గుమ్మడి, జమున ప్రతిభావంతముగా వ్యవహరించి చాలాసేపు రక్తి కట్టించారు. గుమ్మడి కొత్త చిత్రం చూసినప్పుడల్లా ఎప్పటికప్పుడు అతని చిత్రాలన్నింటికన్నా ఇది మరో మెట్టు ఎక్కువ అని అనడం పరిపాటి అయిపోయింది. ఈసారికూడా ఆమాట ధాటీగా అనుకోవచ్చు. ఇందులో ఆయన తన గొప్పగా నటించడమే కాక, ఆ పాత్రకు పాత్రను ప్రాతిపదిక అయిన కథనుకూడా ఒప్పించడానికి ఎంతో దోహదం చేశాడు. రమణారెడ్డి, తన గిరీశం పాత్రను అందంగా నడిపి, కొత్త తరహాలో హాయిగా నటించాడు. కొత్త హీరోలు హరనాథ్, కృష్ణ ఇద్దరూ తమ పాత్రలను కొత్తదనం తోచనీయని సౌలభ్యంతో నిర్వహించారు.

అశ్వత్థామ 'సుస్వరమైన' తెలుగు సంగీతం వినిపించారు. పాటల వరసలన్నీ హాయిగా ఉన్నాయి. భ్రమర ప్రణయానికి వేణుగోపాల్ కూర్చిన నృత్యం, దానికి శ్రీనివాస్, సుశీల, బృందం పాడిన పాట. చాలా బాగున్నాయి. వీణ ఉపశ్రుతిగా జిక్కి పాడిన! మనమే నందన వనమే అనే పాట ప్రత్యేకించి చెప్పుకోవలసినది. చాలా హాయిగా ఉన్న మరొకపాట బాలసరస్వతి సుశీల బృందం పాడిన బాలసారె పాట. గాత్రం వింటున్నప్పుడు ఆర్కెస్ట్రా అడ్డు వస్తోందనిపించేటంత మధురంగా వినిపించింది.

నేపథ్య వాద్యసంగీతం ఈ చిత్రం కథకు ప్రాణప్రాయమైనది. సంగీత దర్శకుడు శబ్దాన్ని నిశ్శబ్దాన్ని కూడా చిత్ర దర్శకుడి ప్రతిభతో ప్రయోగించి వాటికి నిండుతనం చేకూర్చారు.

హైదరాబాద్‌లో సారథీవారు స్టుడియో పెట్టినప్పుడు చిత్ర నిర్మాణంలో సాధకబాధకాల గురించి కొందరికి గలిగిన అపోహలు ఈ చిత్రం చూస్తే పూర్తిగా తీరిపోతాయి. అపోహలు పోగొట్టుకోడమే గాక, మంచి చిత్రం చూడాలని సరదా ఉన్నా కూడా తప్పక వెళ్ళిచూడతగ్గ చిత్రం. ★



'సత్తు, చిత్తు' అంటారే-ఏమిటి స్వామీ?

అని అడిగాడట ఒక శిష్యుడు గురువు గారిని.

'సత్తు' గానిది 'చిత్తు'; 'చిత్తు' గానిది 'సత్తు' అని గురువుగారి సమాధానం.

మరి 'ఆనందం' అంటారే అదేమిటి? అని తిరిగి శిష్యుడి ప్రశ్న!

'అది తెలిస్తే ఏముంది? అంతా తెలిసినట్టే' అని గురువుగారి సమాధానం!

'ఓహో' అని శిష్యుడు తృప్తిగా తల వూపాడట, అర్థమైనట్టు.

ఆ శిష్యుడికి వచ్చిన అనుమానాలే మాకూ వస్తుంటయ్. కాని కొన్నిటికి సమాధానాలు దొరుకుతయ్, కొన్నిటికి సులభంగా దొరకవ్.

## బాక్సాఫీసూత్రవిధానము

కొత్తచిత్రం తియ్యదల్చుకున్న ప్రతి ప్రొడ్యూసరూ, దర్శకుడూ, రచయితా— ముగ్గురూ కూర్చుంటే, ఎదురయ్యే మొదటి ప్రశ్న యిది!—

'ప్రజలకేం కావాలి?'—

'మంచికథ కావాలండి', అని ప్రొడ్యూసరు.

'అయితే యీ కథ చూడండి; సారీ! వినండి'.

కథ చెబుతాం; వింటారు.

విని! "ఇందులో ఏముందండి?"

"లేకేముండి. అంతా 'నావల్'. యిదివర కెప్పుడూ ఏచిత్రంలోనూ లేని కొత్తదనం".

"అవుననుకోండి. కాని ప్రజలకు 'పట్టు తుందా?'

## సూత్రములు, కారికలు, భాష్యము

చిక్కు ప్రశ్న! మనకు బాగుందో లేదో చెప్పగలం గాని, ప్రజలకు 'పట్టుతుందో' లేదో ఎలా చెప్పడం!

'అయితే యీ కథ వినండి. యిదివరకు బాక్సాఫీసు బద్దలుకొట్టిన చిత్రాలలోని సరుకంతా ఒకచోట చేర్చి కూర్చిన సిసలైన కథ'

చెబుతాం, వింటారు!

విని, "అబ్బే! యిందులో సన్నివేశాలన్నీ ప్రజలు యిదివరకు చూచినవేనండి. మళ్ళీ చూడరు. లాభంలేదు." పెదవి విరుస్తారు.

మరి అయితే ఎలా? ఏం చేద్దాం?

'రేపు మరోకథ వ్రాసి తేస్తాను!'

రేపు—

* * *

'ఈ కథ వినండి. ఉత్తమ హాస్య ప్రధానమైన కథ. చిత్రం చూస్తున్నంతసేపూ ప్రేక్షకులు కడుపు చెక్కలై చచ్చిపోవలసిందే! అంతకన్నా ఏం కావాలండీ ప్రజలకి? వాళ్ళు సినిమాకి వచ్చేది వినోద కాలక్షేపానికే.'

"అబ్బే! లాభంలేదండి. కేవలం హాస్య చిత్రాలు ప్రజలకు పట్టవండీ! చూస్తున్నంత




సేపూ నవ్వుతారు. హాలునుంచి బయటికి వెళ్ళేటప్పుడు 'ఆ(. ఏముందిరా యిందులో?' అంటారు. కేవలం హాస్య చిత్రాలు మనకి లాభం లేదుసార్!'

అయితే యీకథ వినండి. గుండెలు కరిగించే ఒక అనాథ కన్నెటిగాథ.

వినిపిస్తాను; వింటారు!

విని 'టూమచ్' సార్! అంత ఏడుపు జనానికి పట్టదండి. ఒకవేళ ఒకసారి చూచినా, మళ్ళీవచ్చి చూసెడానికి యిష్టపడరు. 'రిపీట్ ఆడియన్స్' లేందే పిక్చరు హిట్ కాదండి.'

'మరి ఎటువంటి కథ ప్రజలకు 'పట్టుతుం' దంటారు'?

'సెంటిమెంటు వుండాలండి. ముఖ్యంగా ఆడవాళ్ళను ఆకర్షించాలి. అసైన హాస్యం వుండాలి. 'రొమాన్స్' వుండాలి. యువతీ యువకులను ఆకర్షించాలి......

'అయితే నవరసభరితంగా వుండాలంటారు!'

'అవునండి!'

## మనవారసత్వం

పోనీ పూర్వకవులు వ్రాసిన కథలేవైనా వుంటే - వాటిని చిత్రంగా తీస్తేపోలా!

'ఇదుగో చూడండి! యిది టాగూరుకథ. చాలా చక్కగా వ్రాశాడు. ప్రపంచ మేధావులంతా ఏకగ్రీవంగా పొగిడేశారు. దీన్ని పిక్చరు తీస్తే?'

'అబ్బే! యిందులో కామెడీ ఏదండి? పైగా చాలా 'సెకలాజికల్' సరుకు! 'స్లో' అవుతుంది. 'బోర్' కొడుతుంది. లాభం లేదు!

అవును, అదీ నిజమే! పాపం టాగూర్ కేం తెలుసు, ఆయనకథలు సినిమాలు తీస్తారని! తెలిస్తే, మరోవిధంగా, సినిమాలకు పనికివచ్చేట్లుగా, ప్రజలకు పట్టేట్లుగా, ఆయనే వ్రాసి వుండేవాడు. అప్పుడు 'నోబెల్' ప్రయిజు. !?

మరి యిప్పుడేమిటి కర్తవ్యం? ప్రజలకు 'పట్టే' కథ కావాలే! ఏం చెయ్యాలి! ప్రజలకేం కావాలి'.

చటుక్కున, మెరుపులాగా ఆలోచన వచ్చింది. 'మీకేం కావా'లని ప్రజలనే అడిగితే పోలా!...

## ఔట్ డోర్ వర్క్

ప్రజాహృదయానికి ప్రతినిధి అని చెప్ప దగ్గ ఒక ముఖ్యస్నేహితుడున్నాడు.

ఆయన ప్రతిచిత్రం మొట్టమొదటిరోజునే చూస్తాడు.

జనసముద్రంలో దూర్చిలేక ఫస్టుక్లాసు టిక్కెట్టుకొంటాడుగాని, ఆయన వస్తుతః పావలాక్లాసు ప్రతినిధే.

ఆయనదగ్గర కెళ్ళాను. నేనెందుకు వచ్చానో ఆయనకు ముందుగా చెప్పకూడదు. చెబితే, ఆయన ఆలోచనలో పడతాడు. మనకు వచ్చిన అనుమానాలే వస్తయ్. పని చెడుతుంది.

## సంఘర్షణ

అందుకనీ, ఆ మాటలూ, యీ మాటలు చెప్పి, వరఖ్యానంలో పడవేసి, మనకు కావలసిన సమాచారం లాగెయ్యాలి'

'ఈమధ్య ఏమేం సినిమాలు చూశావురా బ్రదర్!.

'ఆఁ ఏమి సినిమాలురా! మోజు మరి పోయింది! ఛీ! ఛీ! ఒక్కటైనా మంచి సినిమా మచ్చుకు దొరకందే మాద్దామంటే!'

'మంచి సినిమా అంటే?'

'మంచి సినిమా అంటే—మూడుగంటల సేపుసినిమా చూస్తే,మూడునాలుగుపోటన్నా హృదయాన్ని కదిలించాలా!'

'భళ భళ అదితేనోప్పుకోను' అన్నాడు మాకు తెలియకుండా ప్రక్కనేవచ్చి కూర్చున్న మరొక ప్రజాహృదయ ప్రతినిధి! 'ఏడిపించే సినిమాలు చూస్తుంటే నాకు మహా చెడ్డమంట! రోజు యింట్లోనూ, బజార్లోనూ చూసే ఏడుపులు చాలనట్లు,సినిమాలకు పోయినా ఏడుపేనా? ఆ మూడుగంటల సేపైనా-యీ సంసారం, బాధలూ, కష్టాలూ అన్నీ మరచిపోయి, మరో దానిమీదకి మనసు మళ్ళకుండా, కడుపుబ్బ నవ్వించే సినిమాలు కావాలి! మనసును ఆహ్లాదపరచి.......

'ఆపరా కవిత్వం'అని చీదరించుకున్నాడు మొదటి ప్రతినిధి.

## క్లయిమాక్స్

నేను మళ్ళీచిక్కులోపడ్డాను. యిద్దరు ప్రతినిధుల్లో చెరొక అభిప్రాయం ఎట్లా?.

'అయితే, యీ కథ కొంచెంవింటారూ? కాగితాలు తీశాను.

'ఎందుకు?'

'వినండి. విని మీ అభిప్రాయం చెప్పండి. యీ కథ సినిమా తీస్తే మీకు నచ్చుతుందో లేదో—.

'ఆ సంగతి యిప్పుడెట్లా చెప్పగలం. సినిమా తీసి చూపించండి. అప్పుడు చెబుతాం

చచ్చాం! సినిమా అంతా తీసిన తరువాత బాగలేదంటే, అప్పుడు యిక చేసేదేముంది!

'అయితే మీ కేం కావాలో చెప్ప లే కన్నమాట?'

'చెప్పాగా!'

'మరి నువ్వు చెప్పింది, వాడు కాదంటు న్నాడే?'

'వాడి మొఖం!'

'ఏడిశావ, నీమొఖం!' రెండోవాడు!

యిక ఎట్లా యిది తేలేది!.

'మరి అయితే - మొన్న రిలీజు అయిన ఫలానా చిత్రం చూశావా?'

'చూశాను.'

'బాగుందా?'

'ఛీ, బాగలేదు.'

'అందులో చాలా సెంటిమెంటు వుందే! హృదయాన్ని కదిలించే సన్నివేశాలు చాలా వున్నయ్యే! ఎందుకు బాగలేదు?'

'ఏమో! నా హృదయం ఏం కదల్లా! సినిమాలో పాత్రలు ఎంత ఏడ్చినా, నాకు కన్నుతడిగూడ కాలేదు. పైగా విసుగేసి నిద్రవచ్చింది.'

...."నీ హృదయం కదలాలంటే, ఎటు వంటి సన్నివేశాలు కావాల్రా."

'అది తెలిస్తే, నే నిక్కడెందుకుంటాను. వచ్చి సినిమా కథలే రాసే వాణ్ణిగా!'

నానోరు బందయింది!

* * *

## కామెడీ

ఏం చెయ్యాలి. ?— - ఆఁ. యిదివరకు నాకొన్నాఫీసు చిత్రాలకు కథలువ్రాసిన పాటి రచయిత వున్నాడుగా! పెద్ద వాడు! నే నంటే వాత్సల్యం గలవాడు. నోరుతెరచి అడిగితే, చెప్పక పోతాడా!

మంచిరోజు చూచి, ప్రొద్దున్నే లేచి, వెళ్ళాను.

నన్ను చూస్తూనే-'రా, తమ్ముడూ, రా' అని రెండుచేతులూ చాచి, కావిలించుకుని లోనికి తీసుకెళ్ళాడు. 'మంచి సమయానికి వచ్చావే, నేనే నీకోసం రావా లనుకుంటు న్నాను.' అన్నాడు. మంచి 'మూడ్'లో వున్నాడు. నాపని సఫల మవుతుందని ఆశ పడ్డాను.

అయినా తొందరపడి బయటపడకుండా —'ఏమిటండి' అన్నాను.

'ఇవాళ్ళ నుంచి, సినిమా పరిశ్రమలో వున్నాను. మిత్రులంతా, సహకరించి పని జేస్తామని ప్రోత్సహిస్తున్నారు, ఒక పిక్చరు 'ప్రొడ్యూస్' చెయ్యాలనుకుంటున్నారు. ఒక 'మంచికథ' ఏదైనా చూద్దూ' అన్నాడు—

నా నోటివెంట మాటరాలా. అర్థంలేని చిరునవ్వు ఒకటి అతికించుకున్నాను మొఖాన!

'నిజమే తమ్ముడూ! వేళాకోళం గాదు'......

'నిజమేలెండి! అన్నాను.

## సెంటిమెంట్

నిజమేనని నమ్మకంగూడా కలిగింది. డాక్టరు అనేకమంది రోగులకి—లోకులకి —ధైర్యంగా వైద్యం చేస్తాడు. తన భార్యకో బిడ్డకో జబ్బుచేస్తే, ప్రక్క డాక్టర్ని పిలుస్తాడు. అంతేగా!.

'ఏమంటావ్?'

'మాద్దాంలెండి'

'మాద్దాం అంటేగాదు'...

'అలాగేలెండి.'—

ఇంటికి వచ్చాను. ఆలోచనకు అంతు చిక్కలా. ప్రేక్షకులకేం కావాలి? ఎటు వంటి కథలు కావాలి? తెలియకపోతే ఎట్లా? తెలుసుకునేదెట్లా?

పండుకున్నాను. అర్థరాత్రి అయింది. నిద్రపట్టలా! పుస్తకం తీసుకోబోయాను.

(౬౬-వ పేజీ చూడండి)



# యక్షప్రశ్నలు

## సుకుమార్

ఇనగా ఇనగా ఒకవూరు. ఆ వూళ్లో పంచపాండవులలాగే ఐదుగురు అన్నదమ్ములు. వాళ్ళకు బోలెడుడబ్బు. ఆ బోలెడు డబ్బునూ ఇంకా బోలెడుచేద్దామని—అందుకు సినిమా తీద్దామని వాళ్ళకు బుద్ధిపుట్టింది. వెంటనే ఐదుగురు అన్నదమ్ములూ ఒకటోరకం టిక్కెట్లుకొనుక్కొని దడదడమని చెన్నపట్నం చేరుకున్నారు—కుంటూనే ఒక పెద్ద హోటేల్లో అడుగెట్టారు. గడుతూనే స్నానాలూ భోజనాలుచేసి తమలపాకులు వేసుకున్నారు.

"ఇప్పుడేం చెయ్యాలి?" అన్నాడు అందరిలోకీ పెద్దవాడైన అన్నదమ్ముడు.

"నేను వెంటనే రేలంగిని చూడాలి. నా ఆటోగ్రాఫ్ పుస్తకం ఏదీ?" అన్నాడు అందర్లోకీ చిన్నవాడు.

"తమ్ముడూ—రేలంగిని చూదాం. ఐతే, మామూలుగాకాదు. ప్రొడ్యూసర్'ల హోదాలో వెళదాం. అప్పుడూ మనకు కావలసినంత గౌరవం, కాఫీ ఇస్తారు" అన్నాడు ద్వితీయుడు.

"మనకు కథకావాలి — పాటలూ మాటలూ కావాలి. మ్యూజిక్ కావాలి. ఘంటసాలచాత ఎనిమిదిపాటలు పాడించాలి. నేను ఘంటసాలదగ్గరకు వెళ్ళిరానా?" అని లేవబోయాడు మధ్యముడు.

"తొందరపడకు. అందరి ఇళ్ళకూ తిరక్కుండా మనం సినిమా తియ్యలేం. ఒట్టు" అన్నాడు నాలుగవవాడు.

"రేలంగినిమాత్రం బుక్ చెయ్యకపోతే నేను ప్రొడ్యూసరుగా వుండను" అన్నాడు 'పంచ'పాండవుడు.

"ఘంటసాలో?" అన్నాడు మూడోవాడు.

* * *

కొనినిమంది ఈ ఉత్తమ నటీనటులను బుక్ చేసి, కొన్ని హిందీపాటలు తెలుగులోదించి రికార్డించి వామ్మయ్య అనేసరికి చేతిలోడబ్బు కొస్తాఅయిపోయింది.

"ఇప్పుడెలాగ!" అన్నాడు కడంవాడు.

"ఎలాగ?" అన్నారు పెద్దవాడు మినహాగా కడంవాళ్ళు కంగారుపడుతూ.

"సోదరులారా! ఆగండి. సినిమాలు తీయడానికి డబ్బిచ్చే వాళ్ళు కొందరున్నారు వాళ్ళలో నాకుతెలియని డిస్ట్రిబ్యూటరున్నాడు. అతను మనకు సలహాలు, డబ్బుపుచ్చుకోకుండా ఇవ్వగలడు. డబ్బిచ్చి మనచిత్రానికి డిస్ట్రిబ్యూషనూ తీసుకోగలడు. అతనితో మాట్లాడిరావటం ఓసారికాళ్ళమీదపడి రావడం అన్నివిధాలా శ్రేయస్కరం" అని తీర్మానించాడు అగ్రజుడు.

"అతను పాండీబజార్లో దొరుకునా?" అని ప్రశ్నించాడు రెండవవాడు, గద భుజంమీద వేసుకున్నట్టు కండువా విసర్తూ.

"అతని చిరునామా నాదగ్గర వుంది. ఇదిగో. వెళ్లి నాలుగు విషయాలూ మాట్లాడిరావాలి" అన్నాడు పెద్దవాడు.

"నేను వెళతాను" అని లేచాడు చివరుడు, ఆటోగ్రాఫ్ పుస్తకం జేబులో పెట్టుకుంటూ.

"జాగర్త నాయనా—మద్రాసు మహాపట్నము. రకరకాల వ్యక్తులుంటారు. మనుషుల్ని నమ్మలేము. అధర్మం ఎక్కువగా యుండునని పెద్దలవాక్కు" అన్నాడు జ్యేష్ఠుడు సెంటిమెంటల్ లుక్ చూపిస్తూ.

"ఫర్వాలేదన్నయ్యా. యండింగులో అధర్మం ఓడిపోవును గదా.. విన్నా, సరాసరి టాక్సీ ఎక్కి ఈ అడ్రసుకు తీసుకుపొమ్మంటాను. "గేపి, డబ్బిచ్చేస్తాను. డిస్ట్రిబ్యూటరుగార్ని మీట్ చేసి అన్నివిషయాలూ రేలంగితో సహా మాట్లాడేస్తాను" అని ఫ్రున జారిపోయాడు చిన్నవాడు.

"కవిగా ఏ న్యూఫేస్ కో ఇంటర్వ్యూస్ చేస్తే? చవక కూడాను" అన్నాడు ఒక సోదరుడు.

న్యూఫేసులు మంచివేగాని—కొన్ని చిక్కులున్నాయి తమ్ముడూ—న్యూఫేస్ వాల్యూకంటే స్టార్ ఫేస్ వాల్యూ గొప్పది." అన్నాడు పెద్దాయన మేస్టార్ ఫేస్ తో.

"మరి స్టార్స్ వున్న సినిమాలుకూడా దిగజారిపోతున్నాయే" అన్నాడు చాతుర్థయుడు నవ్వుఫేస్ తో.

పెద్దన్నగారు చిరునవ్వాడు.

"నాయనా, కథకావాలోయ్. మనిషికి ప్రాణంలాగా చలన చిత్రానికి కథ ముఖ్యంఅని మన తాతగారు ఏనాడో చెప్పారట."



# ప్రత్యేక లక్ష్యంతో చలన చిత్రాలు

(గతవారం తరువాయి)

ఇలాదరఖాస్తులు పెట్టుకునేందుకు ప్రభుత్వమే అవకాశం యిస్తుంది. డాక్యుమెంటరీలకి విషయాలనూ-చించిన వారి సంగ్రహ పాఠాల ఆధారంగా తర్వాతవిపులంగా స్క్రిప్టులు తయారుచేస్తారు. ఇంతవరకు అయిదు భాషల్లో మాత్రమే తయారౌతున్న డాక్యుమెంటరీ చిత్రాలిప్పుడు 13 భాషల్లో— ఇంగ్లీషు, హిందీ, బెంగాలి, తమిళం, తెలుగు గుజరాతి, మరాఠి, మలయాళం, కన్నడం, అస్సామీ, ఒరియా, పంజాబీ, కాశ్మీరీలలో తయారౌతున్నాయి. ప్రస్తుతం ఫిల్మ్స్ డివిజనులో 110 చలనచిత్రాలు అనేక దశల్లో తయారవుతున్నాయి. 28 చిత్రాలు కంట్రాక్టుమీద తయారవుతున్నాయి. దేశంలోని 4,077 సినిమా థియేటర్లలో చూపడానికి ప్రతివారం 172 కాపీలు తయారు చేస్తున్నారు.

## వ్యాపారేతర చిత్రాలు

మామూలుగా సినిమాలో చూపే డాక్యుమెంటరీ చిత్రాలేగాక ఇతరేతర ప్రత్యేక సంస్థల్లో కూడా యీ డాక్యుమెంటరీ చిత్రాల్ని చూపుతున్నారు. 1958 లో సుమారు 3560 కాపీలను వ్యాపారేతర సంస్థలకోసం తయారు చేస్తున్నారు. ఈ చిత్రాల్ని అమ్మకం బాడుగకివ్వటమే కాకుండా సంచార శకటాల మూలంగానూ, ఫిలిం ప్రచారోద్యోగులచేతనూ కూడా వీటిని ప్రదర్శింపచేశారు. 1957 నుండి ఢిల్లీలోని ఫిల్మ్సశాఖ చిత్రప్రదర్శనశాలలో కూడా డాక్యుమెంటరీ చిత్రాల ప్రదర్శనాలు ఏర్పాటు చేశారు ఈ ప్రదర్శనాలు చాలా జనరంజకంగా వున్నాయి. విదేశాల్లో ప్రదర్శించడానికి అనుమతి పొందిన చిత్రాల్ని 68 కార్యకర్తలద్వారా వివిధ దేశాలకు పంపారు.

ఇలా యీ డాక్యుమెంటరీ చిత్రాలు అన్నవి జాతీయ జీవనంలో అంతర్భాగమై పోయాయి. ఇవి విద్యా వినోదాన్ని మాత్రమే గాకుండా భారతదేశంలోని వివిధ ప్రాంతాల ప్రజలమధ్య భావైక్యతను పెంపొందించడానికిగూడా పూర్తిగా తోడ్పడుతున్నాయి. ❖

# విమానం కథ

(45 వ పేజీ తరువాయి)

సందేహం వేసిందిగదా. ఎలాగేమిటి మామూలుగానే అని మనం జవాబు చెప్పెయ్యవచ్చు. కాని అసలెలా ఎగురుతుంది?

మరి గద్ద రెక్కలాడించకుండా ఎగురుతుందికదా కాకి అలా ఎగరదేం అని నేను మా మావయ్యని అడిగాను చిన్నప్పుడు. వాడి చిన్నప్పుడు కాదు. నా చిన్నప్పుడులే. ఎలాగో అలా ఎగురుతుందిలే నీకెందుకు నీ యేడుపు నువ్వేడూ అని మావయ్య విసుక్కున్నాడు.

చాలాకాలం క్రిందట—విమానాలు రావడానికి చాలాకాలం ముందు—చాలామంది పెద్దవాళ్ళకే ఇలాటి ఊహలు వచ్చాయి. నాగరాజుకి వచ్చినలాటివే. వాళ్ళకి పక్షుల్లా ఎగరాలని ఎంతో ఆశగా ఉండేది. ఇప్పుడైతే విమానాలు తయారుచేశారు కాబట్టి, ఎగరడం గురించి పుస్తకాలనిండా రాశారు కాబట్టి అందరికీ తెలుసుననుకో. ఆ రోజుల్లో మీ అమ్మమ్మగారి చిన్నప్పుడు రైలుబళ్లు కూడా లేవుగదా. అంచేత పెద్దవాళ్ళకి కూడా ఏం తెలీదు. ఇంకా పెద్దవాళ్లని అడిగినా విమా అనేవాళ్లు. అందుచేత ఎవరికి ఎలా ఎగరడం అని సందేహం వస్తే వాళ్ళే చాలా సేపు ఆలోచించుకుని, "ఓహో ఇలా కాబోలు అనుకోడం, అలాగే ఎగరడం దభేలున కిందపడడమూను. మళ్ళీ కాస్త కూచుని ఆలోచించేవాళ్లు. ఓహో ఇందాక తప్పుచేశారు. ఇలాకాబోలు అనుకుని మళ్ళీ ప్రయత్నంచేసేవారు. ఈ రకంగా తిప్పలు పడేవాళ్ళనిచూసి ఆరోజుల్లో అందరూ నవ్వేవాళ్ళు. వెక్కిరించి వేళాకోళంచేసేవారు.

ఒకరోజు పొద్దున్నే ఒక పెద్దమనిషి మేడమీదనించి గొడుగు వేసుకు కిందికిదూకేవాడు. దభేల్న పడి చట్టవిరగొట్టుకుని అమ్మోయ్ బాబోయ్ అని ఏడ్చేవాడు. ఇంకోఆయన జెబ్బలకి చేటలో, చేటలలాటి రెక్కలో కట్టుకుని టపటపలాడిస్తూ గబగబ పరిగెత్తేవాడు, ఎగిరిపోతానుగదా అని. చుట్టూరా జనంచూసి పకపకనవ్వేవారు. వెర్రి వెంగళాయలు అని హేళనచేసేవారు.

కాని నిజంగా వాళ్ళు వెర్రివాళ్ళుకారనీ చాలా తెలివైనవాళ్ళని మెల్లిమెల్లిగా తెలుస్తూవచ్చింది. వాళ్లు ఆరోజుల్లో ఎవరేనా ఎగరాలని ప్రయత్నంచేస్తే, ముందర పోలీసులకి చెప్పాలి అని ఆర్డరు. వాళ్ళు ఎగిరేటప్పుడు పోలీసులు కాపలాఉండేవాళ్లు. అంతెందుకు నేలమీదనడిచే మోటారు కార్లకే కొత్తలో నానాగోలాచేసేవారుట. గుర్రంలాగకుండా, బండి ఎలా వస్తుందీ అని అనుమానం. నిజంగా వెళ్లగానే, అప ఎవరిమీద ఎక్కిపోయి చంపేస్తుందోనని భయం. అంచేత కారునడిపేవాడు ముందర పోలీసులకు చెబుతేతప్ప రోడ్డుమీద కారుని పోనిచ్చేవారుకాదు ఇంగ్లాండులో.

ఇలా కాళ్ళూ చేతులూ విరకొట్టుకుంటూ ముక్కు మొహం చితకొట్టుకుంటూ, వెక్కిరింపులూ వేళాకోళాలూ భరిస్తూ ఆరోజుల్లో వాళ్లంతా ఎగరడానికి పట్టుదలతో ప్రయత్నం చేశారు. దానిమూలంగానే ఇవాళ విమానాలూ, హెలికాప్టర్లూ ప్రపంచంఅంతా ఎగురుతున్నాయి. పొద్దున్న మద్రాసులో విమానం ఎక్కితే మధ్యాహ్నానికల్లా ఢిల్లీ తీసుకెళ్తున్నాయి. అలాటి ప్రయత్నాలవల్లనే రాకెట్లు ఆకాశంలోకి వెళ్తున్నాయి. స్పుత్నిక్కులు చంద్రుడికీ సూర్యుడికీ కూడా ప్రదక్షిణాలు తిరుగుతున్నాయి.

సూర్యుడంటే జ్ఞాపకం వచ్చింది అసలు మనిషి ఎగరవచ్చుననీ విమానాలనేవి మనుష్యుల్ని మోసుకుఆకాశంలోకి పోతాయని మన పురాణాలలోనే ఉంది. (మనుషులు వాళ్లతోటవాళ్లు ఇంకా ఎగరటంలేదనుకో) ఇలా అంటే ఇప్పుడు నవ్వుతారనుకో. ఇపుడు ఈ విమానాలు బాంబులూ అవన్నీ మనకి ఎప్పుడో తెలుసునని కొందరు గొప్ప చెబుతారులే. ఉదలా పోనీగానీ, హనుమంతుడు తెలుసుగదా. అతను వాయుదేవుడి కొడుకు చిన్నప్పట్నించీ ఎగిరేవాడు. ఎగరడానికీ, గాలికీ చుట్టరికం ఈకథలోనే ఉందిగదా. చెప్పొచ్చిన దేమిటీఅంటే, హనుమంతుడు చిన్నప్పుడు పైకెగిరి సూర్యుడిని పండు అనుకుని మింగేయబోయి మాతి కాలి మూర్ఛపోయాడని ఒకకథ ఉంది. సూర్యుడి దగ్గర చదువుకోడానికి వెళ్లాడనీ, దగ్గిర కెళ్లేసరికి ఆవేడికి ఆగలేక కిందపడి పోయాడని ఇంకో కథ ఉంది. ఇంచుమించు ఇలాటికథే గ్రీకు పురాణాలలో కూడా ఉంది. క్రీట్ దేశంలో డొడలస్ అనే శిల్పి ఉండేవాడట. ఆ దేశపు రాజు మెనాస్ కు ఇతనిమీద కోపంవచ్చి ఈ డొడలస్ నీ, ఇతని కొడుకు ఐకారస్ నీ ఒక ఒంటిస్తంభ మేడలో పడేసి తాళం వేశాడు.

## గమనిక

ఆంధ్ర సచిత్రవారపత్రిక 3-6-59 సంచికలో శ్రీ కలగర్ల వెంకటరాజు (పార్వతీపురం) పేరిట "అద్దంలో అందం" అను కథ ప్రచురించబడింది. ఈ కథ ఆంధ్ర సచిత్ర వారపత్రిక 23-6-54 సంచికలో శ్రీ ఆరికిరేవుల రామనర్సారావు రచించిన "అద్దంముందు" అనే కథకు కాపీ అని మా దృష్టికి తేబడింది. ఈ గ్రంథచౌర్యాన్ని మాతోపాటు పాఠకలోకం గర్హిస్తుందని ఆశిస్తున్నాము. —సం||

# ఆరుద్ర గళ్ళనుడికట్టు 5

## ఆధారాలు

**అడ్డం**

1. తారుమారై గోడా బిల్లిది మీటడమువల్ల ఎవరైనా మొగ్గే మనస్తత్వం. (9 అక్షరాలు.)
6. విగ్రహాపుష్టివల్ల నైవేద్యం ఇది కావచ్చు.
8. "జ" తరువాత "జం"ట.
9. సాగుబడిలో పురోగమించు.
11. మునికాళ్ళ కొరకు రణముచని తారుమారు కా!
12. పులావులో చివరది యింత భుజించరాదు కాబోలు!
13. రోగమునకిటూ అటూ ఇటలీ రాజధాని!
14. తనఖా యిలా రాయడంలో రోగము రావచ్చు.
16. వాల్మీకికి నారదోపదేశం.
17. షడ్రసోపేతంగా ఉండడానికి తొమ్మిది దినుసులతో చేసిన వంటలు కాబోలు? లేక నవీన మైనవా?

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | | 4 | | 5 |
| | ■ | 6 | | ■ | ■ | | ■ | |
| 7 | | | ■ | 8 | | ■ | 9 | |
| | ■ | | ■ | | ■ | 10 | ■ | |
| | ■ | 11 | | | | | ■ | |
| | ■ | | ■ | | ■ | | ■ | |
| 12 | | ■ | 13 | | | 14 | | |
| | ■ | 15 | ■ | ■ | 16 | | ■ | |
| 17 | | | | | | | | |

**నిలువు**

1. నిరీక్షణకు నీచోపమానం! కాక తిక్కన గోడలాగు — కలగా పులగం. (9 అక్షరాలు)
2. ఇవి లెక్కించుతూ కూర్చుంటే తినే యోగం జాతకంలో ఉండదు. (6 అక్షరాలు)
3. దిగతుడుపు.
4. తరువాతలో శిక్ష!
5. సువర్ణకలిపి లోముద్దులు లాగుటగువల్ల చీకట్లో చిందులాట వంటిది ప్రాప్తిస్తుంది.
8. తలలోకలేని ఖేచరము జలములో ఉంటే నిజంగా జలంలో ఉంటుంది.
10. సమర శంఖనాదం.
15. కాకా కాళ్ళలో ఊదేదుంది.
16. పొలంలో ఆచారవంతమైన భాగం కాబోలు. ★

### 4-వ నుడికట్టుకు జవాబులు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 పే | 2 రా | 3 స | ■ | 4 ఆ | 5 సా | బి | ■ |
| తం | ■ | 7 రా | మ | 8 రా | జ్య | ము | ■ | 9 జీ |
| 10 బా | 11 బా | ■ | 12 త | ట | ము | ■ | 13 ఊ | త |
| 14 కు | త్తు | 15 కం | ■ | ము | ■ | 16 కూ | ట | ము |
| ■ | 17 క | ద | ము | ■ | 18 త | డి | క | ■ |
| 19 కొ | ల | ము | ■ | 20 ధే | ■ | 21 క | ల | 22 త |
| 23 వా | ము | ■ | 24 ద | ను | 25 క | ■ | 26 ము | వి |
| లి | ■ | 27 స | ర్ప | వ | ర | 28 ము | ■ | వి |
| ■ | 29 కొ | ర | ము | ■ | 30 ము | ను | పు | ■ |

కాశీ మజిలీ కథలు తెలుసా? అందులో రాజకుమారుడు వాళ్లు కీలుగుర్రాలమీద కీలు రథాలమీద ఎక్కి అలా ఆకాశంలో ఎగిరి పోతూ ఉంటారు, ఈడొడలస్కూ అలాటి కీలురథాలు చెయ్యడం తెలుసుట. ఆ మేడలో కూర్చుని కాసినిపక్షి ఈకలూ కొంచెం మైనం సంపాదించి వాటితో రెండు జతల రెక్కలు తయారు చేశాడు. అతనూ, కొడుకూ అవి తగిలించుకుని, వాళ్ళభాషలో జై పరమేశ్వరా అని ఆ మేడలోంచి ఆకాశంలోకి ఎగిరిపోయారట. డొడలస్ ఏమయ్యాడో ఇంకా తెలీలేదు కాని, కొడుకు ఐకారస్ మాత్రం అలా సూర్యుడిదగ్గరికి ఎగిరి వెళ్ళాడుట. అక్కడ వేడికి మైనం కరిగిపోయింది. రెక్కలలో ఈకలన్నీ వేటికవి ఊడిపోయాయి. ఐకారస్ తిన్నగా ఏజియన్ మహాసముద్రంలో పడి మునిగి పోయాడు. ఇదంతే పురాణంలో కథఅనుకో.

మూడువందల ఏళ్ళక్రితం ఒక స్కాచ్ మన్ (స్కాట్లండ్ మనిషి) నిజంగా అంతపనీచేశాడు. (ఇంకావుంది.) ★

# పుస్తక సమీక్ష

## చివరకు మిగిలేది

వ్రాసింది: బుచ్చిబాబు. వెల రు 2-75 నయా పైసాలు. ప్రకాశకులు: ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ. పేజీలు 358.

ఈ నవల చదువుతూవుంటే 'సాఫీ'గా సాగిపోతుంది. చివర పేజీల్లో మటుకు— అంటే అక్కడ ఇళ్ళు తగలబడిపోవడం నించి—కొంత గజిబిజిగా వుంటుంది.

దయానిధిని ఆదర్శప్రాయుడైన వ్యక్తిగా చెయ్యాలెనని గ్రంథకర్తగారి వుద్దేశ్యం. కాని అయోమయవ్యక్తిగా తయారయినాడా అనే అభిప్రాయం వస్తుంది. అతని మనస్సులో ఏ ఆదర్శంవుందో పాఠకులే గ్రహించాలె కాబోలు! ఉద్యోగప్రాయంలో నించివచ్చాడు. డాక్టరు డిగ్రీకి చదువుతాడు. వివేకంగల వాడేనిధి. కాని అతని తెలివితేటలు పనికిరాలేదని తోస్తుంది. సంఘం చాలా ప్రతిబంధకాలుపెట్టి అతన్ని ఇంకోవిధంగా అర్థంచేసుకొన్నదనిపిస్తుంది. కాని సంఘం గుడ్డిదికాదే? రోగులకు చికిత్స చేయడంలో నిపుణుడయితే సంఘం అతన్ని పోగొట్టుకుంటుందా? సంఘంలో మటుకు రెండు అభిప్రాయాలు వుండవా? చాలా డబ్బుగణించే వ్యక్తి రానురాను పైసా సంపాదించలేక పోయినాడంటే సత్యదూరమేమోననిపిస్తూ ఉంటుంది.

కోమలిదగ్గరకు వెళ్ళేవాడు విషయాలు గ్రహించుకోలేకపోయాడు. అమృతమంటె కులాసాగానే వుండేవాడు. తల్లిని తలుచుకున్నప్పుడల్లా మనిషి నీరైపోయేవాడు. వ్యక్తిగత భేదాభిప్రాయాలు అతనికి మామగారికి వున్నా, ఇందిరను అవిధంగా వదిలివేసి చివరకు ప్రాణంమీదకు వచ్చిం తరువాత వెళ్ళడంలో అర్థమేమిటో తెలియదు. అమృతం అంటే గరి, ప్రేమ. అమృతం, జగన్నాథంకథకు మంచిబలం అచ్చిపెట్టారు. నారయ్య పాత్రను బాగా పోషించారు.

కోమలి పల్లెటూరిది. చిన్నపాయాలోనించి వచ్చిన అమ్మాయి. అనుభవంలేనిది. అయినా అంత వెకిలితనంగా మాట్లాడించడం సభ్యంగా లేదు. 'జైట' వుండటమనే విషయం తీసుకొనిరాకుండా మూఢాచారాలని ఇంకోరూపేణా ఖండించడానికి ప్రయత్నించవలసింది. కొన్ని సంభాషణలు చిలిపితనాన్ని సూచిస్తున్నవి. కొన్ని మొరటుతనాన్ని తెలియపరుస్తవి. పచ్చిరసికత్వం కూడా కన్పిస్తుంది ఒకచోట. "వెంటయుండ" అని అసహ్యంగా మాట్లాడిస్తారు సుశీలచేత. మాటలధోరణి సహజమైనా, రాతకొచ్చేటప్పటి నాజూకుగా రాయాలిసింది. మాటలకు హద్దెక్కడవుంది? అంతకంటె అసభ్యపు మాటలనుకూడా ఎక్కించవచ్చుగా ప్రజాసామాన్యం చదివే పుస్తకాల్లో? పురాతనపద్ధతులను, ఆచారాలను ఖండించాలెనని ప్రయత్నించారు గ్రంథకర్త. ప్రేమకు, రసికత్వానికి సంబంధించిన కొన్ని సంభాషణలు సరసంగాలేక కటువుగావున్నవి. చూడండి, అమృతాన్ని అర్థరాత్రివేళ నిధి ఏకాంతంగా కలసికొన్నప్పుడు వర్ణించిన ఘట్టం చదవడానికి సొంపుగావున్నా చదివినతరువాత మనస్సుకు బాధగా వుంటుంది—ఏమిటి ఇట్లా రాశారని. రాజకీయాలు తీసుకొచ్చారు. వివాహ సమయంలో స్వాముల వారిని తీసుకొచ్చి ఆచారాలకు, తత్వాలకు అనవసరమైన చోటిచ్చారు. మూలవున్న ముసలమ్మలను తీసుకొనిరావలసిన అవసరం లేదు ఇందిర మరణంమటుకు గంభీరంగా పరిపూర్ణమైన జాలిని చూపుతూ చిత్రించారు. ఇక్కడ ఇవన్నీ రాసి, వర్ణిస్తేగాని 358 పేజీలదాకా రాలేదు ఈ నవల—అందులో ఈ నవల సంక్షిప్తం చేయబడ్డది. అసలు పుస్తకంలో ఎన్ని పేజీలు వున్నవో ఈ వర్ణనలు వగైరా.

బ్రహ్మసమాజపురోజుల్లోవున్న బెంగాలీ సాహిత్యపు పోకడలు వున్నవా అనిపిస్తుంది పుస్తకం అంతా చదివిన తరువాత.

నిధి ఏమి సాధించాడో తెలియదు. ఏమి సాధించాలెనని అనుకున్నాడో అతనికే తెలియదు. "సిరికిం జెప్పడు, శంఖ చక్రయుగమున్..." అనే పద్ధతిలో బయలుదేరాడు. బయలుదేరినచోటికే వచ్చాడు తిరిగి తిరిగి నిధి. చివరకు నిస్పృహ చెందిఎవరిమీదో కోపంవచ్చి మళ్ళీ కోమలితోనిధి వెళ్ళిపోయాడు ఇంకోయాత్రమీద. కథకు ప్రత్యేకంగా ప్రాముఖ్యత ఇచ్చేందుకు ఏమీలేదు.

మళ్ళి నేను కథను క్లుప్తంగా ఇందులో రాయడంలా. ఎందుకనంటే—తొలి పలుకులో శ్రీ గోపాలరెడ్డిగారు 18 బంతుల్లో తరువాత "ఉల్లాసీదాగా" గ్రంథకర్త కొత్త ఫక్కీలో చివర పేజీలో చెప్పారు. అంతా చదివిన తరువాత చివరకు ఏమి మిగిలినా మిగలకపోయినా పుస్తకం, గ్రంథకర్త బుచ్చిబాబు మిగిలినట్లు తెలుసుకోవచ్చు.

అట్టమీద బొమ్మ కంటికి ఇంపుగాలేదు. వికారంగా వుందేమోగూడా. ఏది ఎట్లా వున్నా పుస్తకం పూర్తిగా చదివేటప్పటికి అట్ట చిరిగిపోతుంది. అట్టగూడా మిగలదా అనిపిస్తుంది. రు 2.75 పెట్టి కొన్న పుస్తకం కొన్నిరోజులు ఇంట్లో తక్కిన పుస్తకాలతోపాటుపడి వుండాలెనని కొన్న వారికి ఆశవుంటుంది. కాబట్టి ఇకముందయినా దక్షిణభాషా సంస్థవారు తగినశ్రద్ధ తీసుకోవలసి వస్తుంది లావాటి పుస్తకాల అట్టల విషయంలో.

"రాధ"

---

## ఇంకేం కావాలి?

[51-వ పేజీ తరువాయి]

భయపడుతూ వచ్చి కావిలించుకుంది— నిద్ర!

* * *

### డ్రీంసీక్వెన్స్!

కల!—(అని తరువాత తెలిసింది.)

ఒక స్త్రీ!

ఆమెకూ నాకూ జరిగిన సంభాషణలు యధాతథంగా యిక్కడ వ్రాయలేనందుకు విచారిస్తున్నాను. కాని, సారాంశం యిది!

ఆమె నాబాధ గ్రహించింది.

ఆమె ఎవరో చెప్పింది.

'ప్రేక్షక హృదయం!'

'హమ్మయ్య' అని ఆనందంతో నిట్టూర్చాను. నాకున్న అనుమానాలన్నీ ఒక్కసారి ఆమెముందు ఒలకబోశాను.

ఆమె హృదయం చాల మృగువైంది.

నాబాధ అర్థం చేసుకుంది.

ప్రసన్న వదనంతో—

సహజ మందహాసంతో—

నన్ను సమీపించి—

నా చెవిలో—గుసగుసలాడుతూ,—

చెప్పింది!

నా ముఖం వికసించింది.

ఆనందంతో హృదయం గంతులు వేసింది.

ఎగిరి గంతువేశాను.

మెలకువ వచ్చింది.

అంతే!—

సెలవు!

* * *

ఆమె నా చెవిలో ఏమి చెప్పిందో వినాలని బహుశా కుతూహలంగా వుంటుంది గదూ మీకు!

క్షమించాలి!

'ఎవరితోనూ చెప్పవద్ద'ని ఆమె శాసించింది!

'ఎవరితోనూ చెప్పలేవు' అని శపించింది!!



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad



మహాబలిపురంలోని గజశిల్పం

—ఫొటో: టి. ఎస్. రామమూర్తి, మద్రాసు.

